# ఆదివాసుల :: :: యుద్ధములు



దిగవల్లి వేంకటశివరావు బి. ఎ. బి. యల్.



నవోదయ పబ్లిషర్సు
విజయవాడ-2.

# పీఠిక

భిల్లులు, గోండులు, కోయలు, సంతాలులు, నాగులు మొదలైన ఆటవిక జాతులవారిప్పుడు భారతదేశములోని నాగరక ప్రజలతో సంబంధము లేక అనారోగ్య దుర్గమ ప్రదేశములందు జీవించుచున్నారు. వారినిగూర్చిన సంగతులు తెలిసికొనుటయే కష్టసాధ్యముగా నున్నది. అయితే ఈ పరిస్థితు లెల్లప్పుడు నిట్లు లేవు.

ఇంగ్లీషువారు తమ తుపాకులను ప్రయోగించి ఆటవికులను మారుమూలలకు తరిమి అడవుల నాక్రమించక పూర్వము ఆదిమవాసులకు తక్కిన ప్రాంతములందలి భారతీయులతో సన్నిహిత సంబంధము లుండెను.

మన పురాణేతిహాసములందీ యాటవికులనుగూర్చిన ప్రశంస కనబడుచున్నది. దండకారణ్యము గోండ్వనము మొదలైనవి చరిత్ర ప్రసిద్ధములు. ఆటవికులును, ఆదిమవాసులును అనాగరకులైనను వారికి మతధర్మములు నీతినియమములు సంస్కృతి సాంప్రదాయములు లేకపోలేదు. వారిలో మనకన్న హెచ్చు నీతినియమములేయున్నవి. ఇంతేకాదు; వారి మతాచారములందు వేషభాషలందు గల విశేషములు కొన్ని తక్కిన భారతీయుల ఆచార వ్యవహారములందు లీనమై శిష్టాచారములైనవి.

మన జాతకర్మలందు, అపరకర్మలందు, వివాహాచారము లందు, వ్రతములందు, నోములందు, పండుగలందు కనబడు ఆరాధనవిధానములు, ఆచారములు, ఆదిమవాసులనుండి సంక్రమించినవే. మేనమామ కూతురును పెండ్లాడు ఆచారము ఆదిమవాసులనుండి వచ్చి శిష్టాచారమైనది.

ఇక భాషావిషయమున సంస్కృత ద్రావిడ భాషావాదులు అన్వయించలేక తలలు పగులగొట్టుకొను శబ్దములు ధాతువులు కొన్ని ఆదిమవాసుల భాషలనుండి వచ్చి దేశభాషలలో కలిసినవే.

అందువలన భారతదేశ రాజకీయ, ఆర్థిక, సాంస్కృతిక చరిత్రరచనకు ఆదిమవాసుల చరిత్ర చాలా ముఖ్యమైనది.

# విషయ సూచిక

# దిగవల్లి వేంకటశివరావు రచనలు

## ముద్రితములు

పోతన వేమనల యుగము (1924)
(చెన్నపురి రాజధానికళాశాల బహుమాన వ్యాసము)

హిందూధర్మశాస్త్రసంగ్రహము (1926)

దక్షిణాఫ్రికా చరిత్ర (1928)
(విజ్ఞాన చంద్రికామండలి)

నీలాపనింద (జమీందారుల కథ) (1929)

సత్యాగ్రహ చరిత్ర (1930)

నిర్భాగ్య భారతము ,,

దరిద్రనారాయణీయము ,,

బార్డోలీ సత్యాగ్రహవిజయము ,,

బ్రిటిషు వస్తుబహిష్కారము ,,

సత్యాగ్రహబోధిని ,,

(పై ఆరు కాంగ్రెసుసంఘ ప్రచురణలు; 1932లో నిషేధింపబడినవి.)

అధినివేశ స్వరాజ్యము (1933) (విజ్ఞానచంద్రికా ప్రచురణ సహకార వస్తునిలయోద్యమము(1933)కృష్ణాకోపరేటివు ఫెడరేషన్ ప్రచురణ)

భారతదేశ స్థితిగతులు Statis tics (1933)

వ్యవహారకోశము (1934) (ఇంగ్లీషు తెలుగు పారిభాషికనిఘంటువు)

శాస్త్రపరిభాష (1935) ,,

అంకుల్‌టామ్సుకథ (1936)

నూతన ఇండియా రాజ్యాంగము (ఆంధ్రరైతుసంఘ ప్రకటన)

నవీనరష్యా ఆర్థికనీతి (1936) ,,

భారతదేశమున బ్రిటిష్ రాజ్యతంత్రము (1938)
బ్రిటిష్ ఇండియా చరిత్ర (1938)
వ్యవసాయదారుల ఋణవిమోచన చట్టము (1938)
ఫెడరేషన్ నిజస్వరూపము
(శ్రీ డాక్టరు భోగరాజు పట్టాభిసీతారామయ్యగారితో కలిసిచేసిన రచన)
(పై గ్రంథములు పునర్ముద్రణము కావలెను)
ఏనుగుల వీరాస్వామయ్యగారి కాశీయాత్ర చరిత్ర (1941)
కథలు-గాథలు మొదటి భాగము (1944)
కథలు-గాథలు రెండవ భాగము (1945)
కథలు-గాథలు మూడవ భాగము (1946)
కథలు-గాథలు నాలుగవభాగము (1947)
(వెంకటరామ అండ్ కో ప్రచురణ)
1857 పూర్వరంగములు (1957 విశాలాంధ్ర ప్రచురణ)
సన్న్యాసుల స్వాతంత్ర్య సమరములు(1957 నవోదయప్రచురణ)
ఆదిమవాసుల స్వాతంత్ర్యయుద్ధము (1958 నవోదయప్రచురణ)

## అముద్రితములు

1. 1857 పూర్వరంగములు (రెండవభాగము)
2. ("1757-1857" స్వాతంత్ర్య సమరములు)
3. ఆంధ్రప్రదేశ్ చరిత్ర
4. కథలు-గాథలు 5, 6 భాగములు
5. జీవిత గాథలు
6. ఆంగ్లప్రభుభక్తి యుగములు
7. బిషప్ హీబరు భారతదేశయాత్ర. ఇత్యాదులు

Add 8. "కుంపిణీ బహదూర్"

# ఆదిమవాసుల స్వాతంత్ర్య యుద్ధములు

# 1785 - 1862

## 1. భారతదేశ ఆటవిక సంపద

ఆంగ్లేయులు మనదేశములో తమ సామ్రాజ్యమును స్థాపింపక పూర్వము దేశమున చాలా దట్టమైన దుర్గమారణ్యములుండెను. అందులో అమూల్యమైన ఖనిజ, వృక్ష, జంతుసంపదయుండెను. ఈ మహారణ్యములందు అనేకవిధమైన వనమృగములు, మహాసర్పములు, పక్షులు నుండెను. అందలి కొండలపైన వింతనాగరికత, వింతలగు వేషభాషలు, ఆచార వ్యవహారములుగల వివిధ జాతుల ఆదిమవాసులుండిరి.

అడవులందు కొండలందు వసించు ఆదిమవాసులకు విల్లు అమ్ములు, ఈటెలు, గండ్రగొడ్డళ్లు ప్రధానాయుధములుగ నుండెను. ఖడ్గమృగ చర్మముతోను, ఎనుబోతు చర్మముతోను ఉక్కుతోను చేసిన డాళ్ళు శత్రువుల బాణములనుండి బల్లెపుపోటులనుండి రక్షించు సాధనములుగ నుండెను. వీరు డప్పులను వాయించుచు, కొమ్ములనూదుచు వేటాడుచు యుద్ధములు చేయుచుండిరి. ఈ ఆటవికులు పరిసర నాగరిక రాజ్యముల నేలు ప్రజలతో సఖ్యముగా నుండిరి. భారతదేశములోని రాజాధిరాజులుకూడా వీరిని కొండదొరలని గౌరవించుచు వీరితో స్నేహముగ నుండి వీరు నివసించు అరణ్యములలోనికి వేటకు వచ్చినప్పుడు వీరివలన సన్మానము లందుచుండిరి. ఆదిమవాసులు ఆటవిక సంపదను నాగరిక ప్రాంతవాసుల కిచ్చి తమ కవసరమైన సరుకులను తీసికొనుచుండిరి,

భారతదేశమున వర్తకము చేయుటకై వచ్చిన ఆంగ్లేయులు అటవికసంపదను చేజిక్కించుకొనుటకై అనేకమార్గములనవలంబించిరి. నయమునను భయమునను మాయోపాయమునను, అడవులలోని వస్తుజాలమును తరలించి, వ్యాపారము చేయుచు లాభమును పొందసాగిరి. తమ మారణాస్త్రములగు తుపాకులను ఫిరంగులనుమందుగుండుసామగ్రిని ఉపయోగించి వనమృగములను అందమైన పక్షులను రూపుమాపి వాని చర్మములను కొమ్ములను దంతములను వెండ్రుకలను ఈకలను అమ్ముకొనసాగిరి. మహావృక్షములను ఛేదించి గొప్పధాతువులను తరలించి లాభము సంపాదింపసాగిరి. అడవుల లోపలిభాగమున గల వివిధవస్తుజాలమును తెప్పించి వ్యాపారము చేయుటతో తృప్తిచెందక ఆంగ్లేయులు భారతదేశములోని వివిధ ప్రాంతముల నాక్రమించి రాజ్యాధిపత్యము స్థాపించిన పిమ్మట అడవులనుకూడా ఆక్రమింపదలచి లోపలి భాగముల లోనికి చొచ్చుకొనిపోయి ఆదిమవాసులతో గిల్లికజ్జాలను పెట్టుకొని వారిపైన తమ ఫిరంగులను తుపాకులను ప్రయోగించి వారిని మూడు మూలలకు అనారోగ్య ప్రదేశములకు తరిమి, వారు వదలివెళ్లిన ప్రాంతములను తమ మేలుబడిక్రింద "ఏజెన్సీ మన్యములు"గా చేసి తమకులోబడిన కొందరు జమీందారుల క్రిందనుంచి వారివలన సొమ్ము వసూలుచేయుచు, వారిద్వారా అటవిక సంపదను యథేచ్ఛముగా తరలించుచు, అమితలాభమును పొందసాగిరి. క్రమక్రమముగా అరణ్యములపైన తమ జిల్లా కలెక్టరుల యధికారమును వ్యాపింపజేసి నిరంకుశ పరిపాలనమును స్థాపించిరి. వీరవలంబించిన అన్యాయపు విధానముల వలన కొందరు జమీందారులును వారిగ్రామములలోని సామాన్య ప్రజలును వాని పరిసరములందు జీవించుచు, తెలుగుమీరిన కొందరు ఆదిమవాసులును జీవనాధారములను గోల్పోయి బాధపడుచు ఇంగ్లీషువారు చేయు అన్యాయములను సహింపలేక తిరుగుబాటు చేయసాగిరి. ఈ తిరుగుబాటులను యుద్ధములను ఇంగ్లీషువారు పితూరీలనిరి. పితూరి యనగా రాజద్రోహము, కలహము కుత్రిమమని యర్థము. ఇట్టి పితూరీలు జరిగినప్పుడు అరణ్యములలోని ఆదిమవాసులు ఆంగ్లేయులతో విరోధించిన

కొంత జమీందారులకును పరిసర ప్రాంతములందలి ప్రజలకును తోడ్పడుచు ఇంగ్లీషువారితో యుద్ధములు చేయుచుండిరి.

ఇట్లు క్రమక్రమముగా ఇంగ్లీషువారి రాజ్యకాలమున పూర్వపు మహారణ్యములు మన్యములుగాను, గ్రామములుగాను, పట్టణములుగాను మారిపోయినవి. కొన్ని మారుమూలలలోని అనారోగ్య ప్రాంతములను చొరరాని అరణ్యములును మాత్రము మిగిలినవి.

ఆంగ్లయుగారంభమునకు పూర్వము మనదేశమును మొగలాయి చక్రవర్తి ఏలుచుండగా కూడా భారతదేశములో నిటీవల జనసంకీర్ణములై యున్న చాలా ప్రాంతములు అరణ్యములుగనేయుండెను. క్రీ.శ. 1608-611 సంవత్సరముల మధ్య అక్బరు చక్రవర్తి రాజ్యకాలమున భారతదేశములో పర్యటనముచేసిన ఫించ్ అను ఆంగ్లేయుడు జాన్‌పూర్ నుండి అలహాబాదు పట్టణమునకు పోవుటకు దుర్గమారణ్యముల మధ్య ప్రయాణము చేయవలసివచ్చినట్లు వ్రాసెను. అక్బరు చక్రవర్తి మంత్రియైన అబుల్‌ఫజల్, గోగ్రానదికి దక్షిణ తీరమునందంతయు అరణ్యము వ్యాపించియున్నదని వ్రాసెను. ఆ ప్రాంతమంతయు ఇంగ్లీషు ప్రభుత్వ కాలమునందు జన సంకీర్ణమైన గ్రామములతో పట్టణములతో నిండియుండెను. మోర్లాండ్ అను నాంగ్లేయ చరిత్రకారుడు, అయోధ్య, ఆగ్రా సంయుక్తరాష్ట్రములను బీహారు రాష్ట్రములోని చాలా భాగములను జనసంచారములేని అడవులు కొండలు గల ప్రాంతములుగా నుండెనని చెప్పినాడు. బెరిల్లీ, గోరఖుపూరు, ముజఫరు పూరుల కుత్తరమున మాత్రము సాగుభూమి యుండెనని ఆయన అభిప్రాయపడుచున్నాడు.

చాలాదూరముగానున్న దుర్గమారణ్యముల వలన మొగలాయి చక్రవర్తికి ఆదాయము రాకున్నను దగ్గరలోనున్న అరణ్యములనుండి కలప, వంటచెఱుకు ఇతర ఆటవిక ద్రవ్యములు ప్రోగుచేసికొనుటకు

---

[1]India at the death of Akbar; W.H. Moreland p.7
Moghal Rule in India: Edwards and Garrett pp 250-251.

వనూజుచేయు స్థానికరుసుములవలన ఆదాయముండెను. అటవికులు అటవిక సంపదనిచ్చి తమకు గావలసిన వస్త్రములను పుచ్చుకొనుచుండుట వలన ననేక అమూల్య వస్తువులలో విరివిగా వ్యాపారము జరుగుచుండెను.

వింధ్యకు దక్షిణమునగల అరణ్యములవలన మహారాష్ట్ర పరిపాలకులైన పీష్వాకు తగుపాటి ఆదాయము వచ్చుచుండెను. తరువాత ఇంగ్లీషువారు చేసినట్లు అడవులను (రిజర్వు) ప్రత్యేకముగా ఆపుచేసి ప్రభుత్వమువారి స్వంత జమీందారీవలె కట్టుదిట్టము చేయుపద్ధతిని మన హిందూ మహమ్మదీయ ప్రభుత్వములు అవలంబింపలేదు.*

మొగలు ప్రభుత్వకాలమున దుర్గమములైన అరణ్యముల పరిసరములందు జీవించు ప్రజలు ప్రభుత్వమునకు పన్ను చెల్లించక తిరుగుబాటుచేయుచు అరణ్యములందు తలదాచుకొనుచుందురని బేబరు చక్రవర్తి తన జ్ఞాపకముంచుపుస్తకములో వ్రాసెను. ఆకాలమున మన అరణ్యములందు అనేక వనమృగ సంతతియుండెను. గోగ్రానదిదగ్గర ఖడ్గమృగములును. అలహాబాదుజిల్లాదగ్గర అడవి ఏనుగులు నుండెను. ఘాజీపూర్‌జిల్లాలో అడవి ఏనుగులు. ఖడ్గమృగములును విస్తారముగా నుండెను. ఇంగ్లీషువారి కాలములో ఖడ్గమృగజాతియే దాదాపుగా లేకుండా నాశనము చేయబడినది. అక్బరు చక్రవర్తి మధుర బృందావనముదగ్గర పెద్దపులులను వేటాడెను. తరువాత ఇంగ్లీషువారి కాలములో మచ్చలైన పెద్దపులులు కనబడని ఇతర జిల్లాలలో కూడా ఆకాలమున నా మృగములు తిరుగుచుండెను. విలియంఫించ్‌దొర, జలౌరు మార్గమధ్యమున సింహములను పెద్దపులులు నుండెనని వ్రాసినాడు. ఎడ్వర్డుటెర్రీ అను వింకొక దొరకూడా దార్ సంస్థాన ప్రాంతమునందుగల గొప్ప యరణ్యములలో పెద్దపులులు నేనుగులు ఇతర వన్యమృగములు నుండెనని వ్రాసినాడు.

జహాంగీరు చక్రవర్తి సింహములను వేటాడుచుండును. 1628 లో చిత్రింపబడిన ఒక పటమునం దాయన వేటదృశ్యము చిత్రింపబడినది. అది ఇప్పుడు కలకత్తా మ్యూజియములో నున్నది.

*Moghal Rule in India pp 289-282

మొగలాయి ప్రభుత్వకాలమున రాజధాని నగరమైన ఆగ్రానగరము చుట్టుపట్లను, ఇతర ముఖ్యపట్టణముల పరిసరములందును వేటకొరకు ప్రత్యేకింపబడిన వనములుండెను. అక్కడ చక్రవర్తియు నాయన దర్బారులోని ప్రభువులను వేటాడుచు వినోదించుచుందురు. అయితే ఆ కాలమున వేటాడువారందరును విల్లునమ్ములు, బల్లెములు ఖడ్గములతోనే వేటాడుచుండిరి. అందువలన తరువాత ఇంగ్లీషువారి కాలమునందు తుపాకులతో కాల్చివేయుటలోవలె వనమృగములు లెక్కలేనన్ని వధింపబడుటకు అవకాశము లేకుండెను. ఆకాలమున అరణ్యములందు జీవించు సంతాలులు భిల్లులు మొదలైన ఆదివాసుల జాతులను గూర్చిమొగలాయి చరిత్రలందు ఎక్కువగా వివరింపబడలేదు. కేవలము నాగరికులను గూర్చిన చరిత్రలంతీ యనాగరకులనుగూర్చి వర్ణింపవలసిన అగత్యము గాని ఔచితిగాని వారికి కనబడలేదు: అయితే విలియంఫించ్ దొర జహంగీరు చక్రవర్తి వేటను వర్ణించుటలో అరణ్యములందు నివసించు జనులనుగూర్చి వ్రాయుచు వారు చాలా బీదవారనియు, దుఃస్థితిలో నున్నారనియు, దొంగతనములు చేయుదురనియు, వారికిని అడవిలోని మృగములకును హెచ్చుభేదములేదనియు వ్రాసెను.* ఆటవిక జనుల మతాచారములుగాని భాషగాని నీతినియమములుగాని తెలియని పాశ్చాత్యుడు కేవలము వారి బాహ్యవేషములను చూచి అట్లనుకొనుటలో నాశ్చర్యములేదు.

దక్షిణదేశమున విజయనగర చక్రవర్తుల కాలమున అడవుల నుండి వారి ప్రభుత్వమునకు చాలా ఆదాయము వచ్చుచుండెను. అడవుల పరిహద్దున గల జనులు అడవులలో పశువులను మేపుకొన్నందుకు పుల్లరిని చెల్లించుచుండిరి. కట్టెలనుకొట్టి తెచ్చి అమ్ముకొనువారు. కొండగుత్త పన్నుచెల్లించుచుండిరి. ఇంకననేకవిధములైన ఆదాయముండెను. ఈ పన్నులు వసూలుచేయు హక్కు వేలముపేయబడుచుండెను.

* Early Travels in India. Foster p. 154
Moghal rule in India; Edward and Garettes

భారతదేశమునకు వచ్చిన పాశ్చాత్యులకు వేటాడుటయన్న చాలా ప్రీతి. ఈ దేశపురాజులును నవాబులును పాశ్చాత్యులకు వేటాడుటకు కావలసిన సౌకర్యములను కలుగచేయుచుండిరి. ఇంగ్లీషువారికి రాజ్యాధికారము కలిగినపిమ్మట వారేయడవులలో నెన్ని మృగములను వధించినను అడుగువారు లేకుండిరి. అందులో పూర్వపుదేశీయుల వేటవలెదు వలె విల్లనంబులతోను బల్లెములతోను ఖడ్గములతోను గాక దూరముగా చెట్లపైన నుండియో ఏనుగులపై నుండియో తుపాకులు గురిపెట్టి కాల్చు పద్ధతివలన. వారు అడవులలోని వన్యమృగములను పక్షులను విచ్చలవిడిగా వధించుచుండిరి. అడవిఏనుగులు ఖడ్గమృగములు సింహములు పెద్దపులులు మొదలైన గొప్ప మృగములు చిఱుతపులులు సివంగులు అడవిపందులు, లేళ్ళు, దుప్పులు ఎనుబోతులు. మొదలైన జంతువులు అసంఖ్యాకముగా వధింపబడుచుండెను. ఇంగ్లీషు వర్తకులు ఉద్యోగులు మృగయా వినోదమునకు దేశములోని ఇతర ప్రాంతమందలి స్నేహితుల నాహ్వానించుచుండిరి. వారి నాశ్రయించి తిరుగు కొందరురాజులు రాజపుత్రులు సిపాయిలు మొదలైనవారు కూడా ఈపద్ధతి వేట ప్రారంభించిరి. అడవిమృగములను చంపినవారికి ఇంగ్లీషు కుంపినీవారికాలములో బహుమతులుకూడా ఇచ్చుచుండిరి. ఈ విధలవలన నూరేండ్లలో మన దేశములోని వన్యమృగములు లక్షలకొలది నాశనమయ్యెను. కొన్ని జాతులు రూపులేకుండాపోయెను. ఇట్లు చంపిన మృగముల చర్మములు కొమ్ములు దంతములు ఎముకలు పక్షియీకలు మొదలైనవి చాలా విలువ గలిగినవై యుండెను. ఈవేటనెపమున నాంగ్లేయు లరణ్యములలో చొరబడి అటవిక జాతులను తుపాకుల బలముతో వెనుకకు తరుమసాగిరి. అరణ్యములలోని విలువగల చెట్లను నరికించి లాభము పొందసాగిరి. పూర్వము దట్టమైన అడవులుగానున్న కొన్ని ప్రాంతములందు చెట్లు, మృగములు నాశనము చేయబడి గ్రామములు పట్టణములు సాగుభూములుగా మారిపోయి నాగరికప్రజల కావాసములయ్యెను. ఆంగ్లేయు లిట్లు ధ్వంసము చేయగా మిగిలిన యరణ్యములు భారతదేశమున 260139520 యకరముల

వి స్తీర్ణము గలవి మిగిలెను * దానిలో చాలా భాగము నింగ్లీషువారు రిజర్వు ఫారెస్టులుగా ప్రత్యేకించి అనుజ్ఞలేనిదేఎవ్వరును వానిలోనికిపోయి వేటాడుటకాని, చెట్లను నరుకుటగాని, అటవికవస్తువులను ప్రోగుచేసి తెచ్చుకొనుటగాని వీలుకాదని నిషేధించిరి. కొన్ని ప్రాంతములను సంరక్షితారణ్యములనిరి. మిగిలిన పనికిమాలిన ప్రాంతములను వర్గీకరింపకుండవదలిరి. ఆదివరకీయరణ్యములందు స్వేచ్ఛగా తిరుగుచు దాని సంపద ననుభవించు అటవికజనము అస్వతంత్రులై జీవనాధారము లేకుండాపోయిరి.

1824 నుండి హైదరాబాదులో ఉద్యోగము చేసిన మెడోస్ టెయిలరుగారు*తనజీవితచరిత్రలో తనతోడి సైనికోద్యోగులతోను సివిలు అధికారులతోను అరణ్యములందు తరుచుగా వేటాడుచుండినట్లు వ్రాసినాడు, "1837లో మేము బురాన్‌పూరుకు చాలా ఆనందకరమైన మృగయా వినోద పర్యటనమును చేసితిమి. నా పాత స్నేహితుడు మేజర్ సదర్‌లాండు గ్వాలియరులో రెసిడెంటుగా నియమింపబడెను. అక్కడకు వచ్చి దాని పరిసరారణ్యములందు పెద్దపులులను వేటాడుటకై కొంతమంది పాశ్చాత్య మిత్రులను అతడాహ్వానించెను. ఆ ప్రయాణము చాలా ఆహ్లాదకరముగా నుండెను. అప్పుడు మాకు కనబడిన దృశ్యములను ఎన్నిపుటలలో వ్రాసినను తనివితీరదు. మేము చాలాసారులు పెద్దపులులను వేటాడితిమి. రెసిడెంటుగారి ఆతిథ్యమును స్వీకరించి ఆనందించితిమి." అని అక్కడ జరిగిన విశేషములను వర్ణించినాడు.

ఆరణ్యములందు చాలా విలువగల ఖనిజములు, రాక్షసిబొగ్గు, ఇనుము,రాగి, ఇతరలోహములు గల గనులున్నవి. కలపకు కర్రకు పనికి

---

*1950లో భారతదేశమున 160356 చదరపు మైళ్ళ విస్తీర్ణముగల అడవిభూమి యుండెను. అనగా మొత్తము దేశముయొక్క భూభాగములో నూటికి 15.2 వంతులు ఇందులో 55282 చ. మై. ప్రయివేటు అడవులు. 104670 చదరపుమైళ్ళ అడవులు వివిధ రాష్ట్రములచేత పరిపాలింపబడుచున్నవి.

*Story of My Life Meadows Taylor pp 86-87

మద్ది టేకు ఏగిస వేప మొదలైన మహావృక్షములు, వెదుళ్లు పేము, తుంగ, రంగులకు పనికివచ్చు వేళ్లు, కాయలు, లక్క, జిగుళ్లు, ఓషధులు వన్యమృగముల చర్మములు, కొమ్ములు, మొదలైన ద్రవ్యములు దినుసులు దొరుకును.

అడవులలోని వస్తుజాలమునుగూర్చి పరిశోధించిన శ్రీ కాంతి కామేశముగారు వాని నిట్లు వర్గీకరించిరి:

1. ఆహారమునకు పనికివచ్చునవి. చింత, నేరేడు, మామిడి, వెలగ, పనస, ఉసిరి, జీడి, చారపప్పు, కంది, చిక్కుడు, అల్లము పసుపు, పాలగుండ, కంద, చేమ, మొదలైన దుంపలు, తేనె మొదలైన ద్రవ్యములు.

2. గృహనిర్మాణమునకు, గృహపరికరములకు వంటచెఱుకునకు పనికివచ్చునవి: టేకు, ఇరుగుడు, వేప, ఏగిస, గుగ్గిలము, వెదురు, చందనము, మొదలైనవి. చింత, తుమ్మ, మొ॥ పేము, తుంగ, కాయజద్ద మొదగునవి.

3. తైలవర్గమునకు చెందినవి: కాగు, ఇప్ప

4. నారకు పనికివచ్చు: అడ్డ, కిత్తనార.

5. రంగులకు పనికివచ్చునవి: కరక్కాయ, జాబరా, నల్ల, లక్క.

6. జిగురు మొదలైనవానికి పనికివచ్చునవి. తుమ్మ, తంగేడు.

7. ఔషధములకు పనికివచ్చునవి ముషిణి, వెల్ల, గచ్చ, మూలికలు, పందికొవ్వు ఉప్పురుపాలు, వేపచెక్క.

8 పశువుల మేతకు పనికివచ్చునవి: గడ్డి, ఆకు, అలము, తుమ్మ, మొదలైన చెట్లకాయలు పండ్లు.

9. అడవిజంతువులనుండి యుత్పత్తియగునవి: ఏనుగు దంతము దుప్పికొమ్ములు, అడవి ఎనుబోతు (Bison) కొమ్ములు, చర్మములు.

10 ఇతరవస్తువులు: కుంకుడు, సీకాయ, బూరుగు, ప్రత్తి, మైనము, విస్తళ్ళు వగైరాలు.

11. పరిశ్రమలకు పనికివచ్చు ముడిదినుసులు: కర్ర కలప, మంచములకు, కుర్చీలకు, బల్లలకు, కాగితపు పరిశ్రమకు, గృహోపకరణములకు, నివి యుపయోగించును. అగ్గిపుల్లల పరిశ్రమలకు పెన్సిళ్ల పరిశ్రమకు నిది యుపయోగించును. ఎంతెనలకు, రైళ్ళపట్టాలక్రింద దిమ్మలకుకూడా నవి యుపయోగించును.

12. తోళ్ళను పదునుచేయుటకు రంగులకు కరక్కాయ నుపయోగింతురు.* మెక్లీను మేన్యూలు 1వ సంపుటము 313వ పుటలో అడవులలో దొరుకు వస్తుజాలము నతడు పదునొకండు రకములుగా విభజించి యున్నాడు. మన దేశమునుండి చేయబడు ఎగుమతి వ్యాపారములో నీ వస్తువులు చాలా ముఖ్యమైన భాగములుగా నున్నవి. అందువలననే పాశ్చాత్యులీ వ్యాపారముపైన కన్నువేసిరి.

హిందూ మహమ్మదీయ రాజ్యకాలమునందీ యాటవిక జనము ఇతర ప్రాంతములందలి నాగరక జనులకు వెనుకబడియున్నను వారితో స్నేహభావముతోనే యుండిరి. మహారణ్యములు వారి స్వాధీనమందున్నను అందు లభించు అమూల్య ద్రవ్యములు వస్తువులను ముఖ్యముగా గృహనిర్మాణమునకు, గృహపరికరములకు పనికివచ్చు కలప, కర్ర, గడ్డి, ఆహారమునకు ఔషధములకు, పరిశ్రమలకు పనికివచ్చు ఇతర వస్తుజాలము అపూర్వమైన ఆటవిక ద్రవ్యములను నాగరిక జనులకిచ్చి తమకు కావలసిన వస్తువులను తీసికొనుచు నిరభ్యంతరముగా వ్యాపారము చేయుచుండిరి. నాగరికులును వీరిని కొండదొరలని ఆదరించుచుండిరి. వీరు సాధారణముగా ఎవరికి నపాయము చేయువారుగారు. అబద్ధమాడరు, నాగరకులను మోసగించరు. ఇంగ్లీషు వర్తకులు కేవలము విజాతీయులైనందున ఈ ఆటవికజాతులను మృగప్రాయులని తలచి వీరిని నీచముగా చూచుచు వీరిని మోసగించుచు తమ తుపాకి గుండ్లతో వీరిని భయపెట్టజూచుచుండినందువలనను తమ నాశ్రయించిన దేశీయ దళారీలచేత అన్యాయము చేయుచున్నందువలనను పూర్వపు

* ఆంధ్ర సర్వస్వములో అడవులనుగూర్చి శ్రీ శొంఠి కామేశముగారు వ్రాసిన వ్యాసము పుటలు 200 - 20.

సౌహార్ద్రభావములు క్రమక్రమముగా నశించెను. ఇట్టిస్థితిలో ఇంగ్లీషువారు రాజ్యాధికారమును సంపాదించి విజృంభింపసాగిరి.

భారతదేశ భాగ్యభోగ్యములను గూర్చి పాశ్చాత్య దేశీయులు కథలుగా చెప్పుకొనుచుండగా పోర్చుగీసువారి దేశమునకు ఓడలపైన వచ్చి ఇక్కడి అపూర్వములైన వస్తువులనుతీసుకొనివెళ్లి విపరీతధరలకు పాశ్చాత్య దేశములందు విక్రయించి అమితలాభమును పొందసాగిరి.

"రాలే" అను ఇంగ్లీషు ప్రభువుక్రింది నౌకాధికారి యొకడు 1593 లో నొక పోర్చుగీసు ఓడను పట్టుకొనగా అందులో ఇంగ్లీషువారి కన్నులు మిరిమిట్లు గొలుపు హృదయాకర్షకరములైన హిందూదేశపు అమూల్య వస్తువులు కనబడెను. మంచి పెద్దముత్యములు, బంగారము, వివిధ రకముల పట్టుబట్టలు, నూలుబట్టలు, దంతము, పింగాణీ, ఔషధ ద్రవ్యములు పరిమళ ద్రవ్యములు, ఇంకనెన్నో అపూర్వ వస్తువులునం దుండెను. అంతట ఇంగ్లీషువారి దేశముతో వ్యాపారముచేయుట ప్రారంభించిరి. * త్వరలోనే వీరు మనరాజులను నవాబులను ఆశ్రయించి వ్యాపారపు హక్కులుపొంది అన్ని నగరములలోను పోటీవ్యాపారము ప్రారంభించిరి.

భారతదేశము నేలు మొగలాయి చక్రవర్తిని రాజులను నవాబు లను ఆశ్రయించి ఇంగ్లీషువారి దేశమునుండి ఎగుమతి దిగుమతి వ్యాపారము చేసికొనుటకు పర్మానాలను అనుజ్ఞను పొంది కుటిలరాజ్య నీతిని ప్రయోగించి మన నవాబులను రాజులను వశపరచుకొని దేశములో మత్పత్తియగు సమస్త పదార్థములందును ఇక్కడి పారిశ్రామికులు తయారుచేయు అన్నివస్తువులందును సర్వముక్తా వ్యాపారము చేయుచు తమ బలుకుబడిని ప్రభుత్వాధికారమును ఉపయోగించి వర్తకులను వారి పారిశ్రామికులను నిర్బంధించి వారితో పోటీవ్యాపారము చేసి వారి జీవనాధారములను పోగొట్టిరి. వారి ఫ్యాక్టరులు, గుమాస్తాలు వంగరాష్ట్రమున ప్రతి గ్రామమునకును పోయి నూలుపత్రము, సున్నము, ఆవాలు, పొగాకు

British Rule in India - Harriet Martineau 1857 p. 31

పసుపు, నూనె, బియ్యము, జనపనార, గోనెలు, గోధుమలు, ఇవి యేవి
యననేల: అన్ని అపరదినుసులను దేశములో నుత్పత్తియగు అన్ని
వరుకులను చౌకగా కొని ప్రియముగా విక్రయించుటకు మోసము దౌర్జ
న్యము చేయుచున్నారని వర్తకులను పారిశ్రామికులను గ్రామస్తులను
బలవంతము చేయుచున్నారని వారు సుంకములు చెల్లించక మోసగించు
చున్నారని 1765 లో జమీందారులు కంపెనీవారికి ఫిర్యాదుచేసిరి. *

ఆంగ్లేయులీ దేశమున ఎగుమతి దిగుమతి వర్తకము చేసికొను
టకు వచ్చునాటికి మొగలాయి సామ్రాజ్యమునందు చేరిన రాష్ట్రభాగము
లందేగాక దేశములోని మారుమూల ప్రాంతములందలి అరణ్యములందు
కొండలందు ఖనిజ వృక్షజంతు సంపద కొల్లలుగా నుండెను. దేశములో
ననేక వస్తువులనుత్పత్తిచేయు పరిశ్రమలుండెను. ఇంగ్లీషువారు త్వరలోనే
దేశములోనివ్యాపారములలోకూడా ప్రవేశించి రాజులను నవాబుల నాశ్ర
యించిసర్వమక్తా వ్యాపారపు హక్కులు సంపాదించిదేశీయులతో పోటీ
చేయసాగిరి. అరణ్యములందలి అమూల్య వస్తుజాలము నాటవికులు తెచ్చి
నాగరికులకిచ్చి తమకు గావలసిన వస్తువులను తీసికొనుచుందురు. ఈ
ఆటవికులు పేరునకు పరిసర రాజ్యములకు లోబడినవారైనను వీరిపైన
పన్నులను విధించి వసూలు చేయగల ప్రభువులు లేకుండిరి. అడవుల
నానుకొనియున్న మన్యములందు మాత్రము కొందరు కొండరాజులు
జమిందారులును బయలుదేరి తమ దేశముతోపాటు ఆనుకొని యున్న
అరణ్యమున కొంతభాగమున శిస్తులు పన్నులు వసూలు చేయుటకు
రాజులవలన ఇజారాలుపొంది, ఆటవికులతో స్నేహముగనేయుండి
అన్ని వస్తువులను తెప్పించి నాగరిక ప్రపంచమునకు సరఫరా చేయు
చుండిరి. ఈ వ్యాపారమునందు స్వార్థపరులైన దళారీలు బయలుదేరిరి.
కొందరుదళారీలు మోసములుచేయుచు లాభము లార్జించుచుండిరి. కొంద
జమిందారులు కొంతమందిని ఆయుధపాణులైన జనమును గూర్చుకొని
కొండజాతులవారు పరిసరగ్రామములపైన బడి దోచుకొనకుండా కాపా

---

Rise and fulfil ment of British Rule inIndia. Thompeon and G3 rratt. pp 101—2

యీదు దేశమునేల రాజులకు సహాయము చేయువారుగా నున్నందున వారికి స్వల్పమైనకప్పములను చెల్లించుచుండిరి. ఒక్కొకపుడి మన్యపు దొరలా స్వల్పపుకప్పములుకూడా చెల్లింపక బాకీలు పెట్టుచు రాజులు బెదిరించినప్పుడు అడవులలోనికి పారిపోయి ఆటవికజాతులవారి దగ్గర తలదాచుకొందురు. రాజసేవకులు అనారోగ్యప్రదేశములకుపోయి కప్పము వసూలు చేయలేకుండిరి.

ఈ పరిస్థితులలో కోట్లకొలది రూపాయిల విలువగల ఆటవిక సంపదపైన నింగ్లీషువర్తకులు కన్నువేసిరి. అంతట అరణ్యముల పరిసరములనున్న కొండ జమీందారులతోను వారిదేశములలోని దళారీవర్తకులతోను ఇంగ్లీషువారు స్నేహముచేసి ఆటవిక సంపదను తరలించి తెప్పించి కోటివ్యాపారము చేయసాగిరి ఇందుకొరకు ధనమిచ్చి కొందరు ఏజంటులను నియమించిరి. ఆకాలమున ఇంగ్లీషువారు తక్కిన చోటులలో చేసినట్లే ఈ మన్యప్రాంతములందు చేసిన వ్యాపారములో కూడా వర్తకులను పారిశ్రామికులను మోసములు అన్యాయములు చేయుచు లాభము లార్జించుచుండిరి.

ఇంగ్లీషు కుంపిసీవారి కాలములో అడవులలోను కొండల లోను నివసించు ఆటవికజాతుల వారితోచేయు వ్యాపార వ్యవహారములను గూర్చి ఇంగ్లీషు వారేకొందరు వ్రాసియున్నారు.

"కొండలనుండి నాటుకువచ్చు ముఖ్యమైన వస్తువులు జయపురము నుండి యినుము, విశాఖపట్టణములో ప్రసిద్ధమైనవస్తువులు గేదెకొమ్ములు మైనము తేనె కొండచీపుళ్ళు, గుగ్గిలము, పాలగుండ, పసుపు, అల్లము శొంఠి, కుంకుడుకాయలు, షికాయ,' నల్లజీడి గింజలు కరక్కాయలు కమలాఫలములు, మామిడిపళ్లు, చింతపండు బొంతఅరటిపండ్లు, మొక్కజొన్నకొత్తులు, జామిపండ్లు, వంకాయలు, వెల్లుల్లి, మందులకు రంగులకు నుపయోగించువేళ్ళు అనగా వసంతగుండ, పిప్పలి, మోదిగంజాయి జెందుపుగింజలు, దుంపరాష్ట్రము, గంటుభారంగి తెగరుచెక్క మొదలైనవైయున్నవి." అని మేస్తర్ బాస్వెల్ గారు తెలియచేసిరి. ఇట్టలుఉప్పు, సముద్రపు చేపలు, పొగాకు నల్లమందు ఇంక ననేక తరహాల ధాన్యదిను

ములు పప్పుదినుసులు, కాయకూరలు, కిరాణావస్తువులు, పంచదార,గాజులు మొదలైన వానిని నాటుకోమట్లు తెచ్చి కొండవాండ్ర కమ్ముదురు.

బట్టల దినుసులు, చర్మములు, కొమ్ములు, వేళ్ళు, పంచదార, బెల్లము, బెల్లపుసారాయి, నీలిమందు ఉలవలు పొగాకు, గోనెపంచులు పసుపు, మిరపకాయలు మొదలైనవి ముఖ్యమైన యెగుమతులుగా నున్నవనియు, దినుసులు ఇంగ్లాండుకును ఫ్రాన్సుకును ఎగుమతి యగుచున్నవనియు విశాఖపట్టణము జిల్లా మేన్యూలులో వ్రాయబడియున్నది. *

* విశాఖపట్టణము జిల్లా మేన్యూలు, కార్మైకేల్, 1868 పుటలు ౨౮౧ ౨౮౩–౨౮౩.

# 2. ఆదిమవాసులు

ఆదిమవాసుల వేషభాషలు, ఆచారవ్యవహారములు భారతదేశములోని నాగరికప్రాంతపు జనులకు భిన్నముగానుండుట జూచి వారు అనాగరికులనికొందఱనుకొనిరి గాని వారు కేవలము అనాగరకులని అనుకొనుట పొరబాటు. వారు భారతీయులతో సంబంధములేని భిన్నజాతులవారని ఆంగ్లేయులు చేసిన ప్రచారముకూడా అబద్ధమైనదే. మనుష్యులు జీవించు ప్రదేశముయొక్క భూగోళపరిస్థితి శీతోష్ణస్థితి - పరిసరములు, ఇతర ప్రాంతములతో సంసర్గమునకు గల అవకాశములు మొదలైన విషయములను బట్టియే వారి వేషభాషలు ఆహార విహారములు ఆచారవ్యవహారములు నేర్పడియుండును. వారు వసించు ఇండ్లయొక్క నిర్మాణము వారు ధరించుదుస్తులు, వారుతిను ఆహారము వారికి లభించు వస్తువులను బట్టి యేర్పడునను సంగతి అందఱికి తెలియును. ఒక ప్రాంతమునందు వసించు జనుల పరస్పరసంబంధములు కూడా దానినిబట్టియే యేర్పడునని, ప్రజల జాతీయసంస్కృతి సంప్రదాయములకు వారు వసించు ప్రదేశము పునాదిగానుండునని, శాస్త్రజ్ఞులు కనిపెట్టినారు. ఆదిమవాసులు వసించు ప్రాంతములందలి కొండలు, లోయలు అడవులు నదులు చెట్లు మృగములు పక్షులును వారి జీవనవిధానమును సరిదిద్దును. వారు తమకు దొరికిన వాటిని వెదుళ్ళను కర్రను లోహమును ఉపయోగించి తమకు కావలసిన పనిముట్లు పరికరములు తయారు చేసికొందురు. ఒకప్రాంతమున వసించు ఆదిమవాసుల జనసంఖ్య, వారి యావశ్యకములు వారికి దొరకు వస్తుజాలము వారికి గల తెలివితేటలు నైపుణ్యమును బట్టి వారి జీవితవిధానము ఆర్థికస్థితి రూపొందును.

అడవులలో దొరుకు కందమూలములు కాయకూరలు పండ్లు ఆకుఅలములు వెదురుబియ్యము మొదలైనపదార్థమును ప్రోగుచేసికొనుచు జంతువుల పక్షులను వేటాడుచు జీవించు ఆటవికజాతులవారు సాధారణముగా అడవులలో నొకచోటనుండి యింకొకచోటుకు ఆహారాన్వేషణమునకై పోవలసివచ్చును. అందువలన వారు కొన్ని కుటుంబములుగాను గుంపులుగాను కలిసి పోవుదురు. అయితే ఈ గుంపుల కొక్కొక్కప్పుడు ఆహారాన్వేషణమునందే పోటీ యేర్పడును. అంతటవారు అడవులలోని కొన్ని ప్రాంతములను వాటాలుగా విభజించుకొందురు; చెట్లను కూడా పంచుకొందురు.

ఆటవికులు సాధారణముగా అడవులలోని చెట్లను తగులబెట్టి వాని బూడిదలోసస్యము జల్లుచుందురు, వర్షము పడగనే అవి విరుగబండును. తరువాత వారింకొక ప్రాంతమునందట్లు చేయుచుందురు. దీనికి "పోడు" వ్యవసాయమని పేరు. సంతాలులు, ముండాలు, మొదలైన ఆటవికజాతుల వారు నిన్నమొన్నటి వఱకును ఇట్లే జీవించుచుండిరి. అయితే వారిటీవల అడవుల పరిసరములందుగల గ్రామములలోను పట్టణములలోను గల నాగరిక జనులనుచూచి వారును తమ ప్రాతపద్ధతి జీవితమును విడనాడి నాగరిక జనులవలెనే ఫ్యాక్టరీలలోను ఇతర చోటులను కూలి పనిపాటులు చేయుచు సంతలలోను బజారులలోను తమకు కావలసిన ఆహార పదార్థములను గొనుచు చౌకబారు ఆభరణములను కొనుచు సమ్మెలు చేయుచు తమ హక్కులను గూర్చి కేకలువేయుచు తమలో కొందఱు రాజకీయ నాయకులను కూడా తయారుచేసికొనిరి. ఇప్పటికిని నాగరకత సోకని అడవిలోపల జీవించు తమతోడి జాతివారిని చూచి వీరు పరిహసించు చుందురు.

## కొండ ఖారియాలు

వంగదేశమున మయూరభంజి, సింగ్‌భూమ్, మాన్‌భూమ్‌ప్రాంతములందుగల దుర్గమములైనకొండలలో నివసించు 'ఖారియా' జాతివారికిఆధునికనాగరికత తగులలేదు. వారందుప్రాంతములలో సుఖజీవనము

వారు మార్గములులేవు. అక్కడఆహారము సులభముగాలభించదు. అందువలన వారాహారము సంపాదించుటకై తమ తెలివితేటలను బుద్ధిసూక్ష్మతనుపయోగించి తమకొండలలోదొరుకు ముడిఇనుముతో వారుకొన్ని పనిముట్లు పరికరములు, తయారుచేసి వానిని మృగములను వేటాడుట లోను చేపలను పట్టుటలోను పక్షులను పట్టుటలోను చెట్లను కొట్టుట లోను పాత్రసామగ్రిని చేయుటలోను మంచములు దువ్వెనలు సన్నపు బట్టలు తయారుచేయుటలోను ఉపయోగించుచుండిరి. వృక్షసంబంధము లైన ముడివస్తువులు శాకముల దినుసులు, సొరకాయబుర్రలు, చెట్ల బెరళ్లు, ఆకులు నుపయోగించి వారు తమ ధాన్యపుదినుసులను. వీటిని నిలువ చేసికొనుచుండిరి. ఎండకు వానకు ఆచ్ఛాదనము కలిగించుటకు ఆకులు అల్లుటకు కుట్టుటకు కావలసిన దారమును త్రాళ్ళను తయారు చేయుచుండిరి. పండుకొనుటకు మెత్తలను పరుపులను తయారుచేసిరి. తేనె ప్రోగుచేయుటకు చెట్ల నెక్కుటకు కావలసిన నిచ్చెనలను తయారు చేసిరి. వారి యిండ్లకు కావలసిన నిలువు నిట్టాడు లకు వెదురు బొంగులుపయోగించిరి. వెదుళ్ళను చీల్చి తడికలు, గంపలు, బుట్టలు అల్లుచుండిరి.

కొండకారియాజాతి వారొకపూట పరియన్నము దొరికినచో అదృష్టవంతుల మనుకొందురు. తేనె, పండ్లు, కందమూలములు, కూర గాయలు, దుంపలు ఆకుఅలములు ఉడకబెట్టి దినముల తరబడి కాల క్షేపము చేయవలసి వచ్చును.

వీరు వలలువన్ని పక్షులను పట్టుకొని వానినిచ్చి బియ్యము కూర గాయలు ఇతర ఆహార పదార్థములు పుచ్చుకొందురు. ఒక్కొక్కప్పుడు పక్షులను తామే తిందురు. వీరు తరుచుగా మామిడికాయలు, పట్టు, జిగుళ్లు మొదలైన దినుసులలో వ్యాపారము చేయుచుందురు. వర్షకాలమున వారికి వ్యవసాయపు పనులందవు అప్పుడువారు అడవులకుపోయి, పండ్లు కందమూలములు తేనె ప్రోగుచేయుదురు. అట్టి సమయములో కొన్ని దినములు అడవాండ్రు, పిల్లలు తప్ప మొగవారు వారిగూడెములలో నుండరు.

ఖారియాలు పచ్చిమాంసమును తినరు. సాధారణముగా గొడ్డు మాంసము నువ్వుతోకలిపి యెండబెట్టుదురు. కూరగాయల నువ్వుతో ఉడకబెట్టి పసుపు జల్లుదురు. ఖారియాలు అనేక విధములైన ఆకులను దుంపలను పువ్వులను నీటిలోగాని బియ్యమువార్చిన గంజినీళ్ళతోగాని యుడకబెట్టి తినెదరు. కొన్నిరకముల పుష్పములను వేయించిపిండిగా చేసి రొట్టెలు చేయుదురు. ఖారియాజాతి వారు కొన్నిపండ్లను వ్రేళ్ళను ఔషధములుగా నుపయోగింతురు. కరివేపపండువంటి నల్లనిఅడవి వాక పండ్ల (Black berry) రసమును పులియబెట్టి నెలలకొలది నిలువ యుంచి వాడుకొందురు. వారు చింతపండును అన్నమున కాదరువుగా వాడుదురు. తక్కినముండా జాతులవారి వలెనే వీరును మాంసమును చిన్నముక్కలుగా కోసి ఆకులలో చుట్టి నిప్పుపైన కాల్చి తినుచుందురు. కొంచెము నాగరికత మీరినవారు మాంసము నుడకబెట్టి ఉప్పు పసుపు మిరియములు జల్లి తినుచుందురు. వీరు బియ్యముతో నొకవిధమైన సారాయమును తయారు చేయుదురు. కొన్నిఆకులు దుంపలనుండి ఆసవములు తయారు చేయుదురు. మఱికొన్ని పదార్థములనుండి కూడా సారాయము తీయుదురు. నాగరక ప్రపంచము తోడి సంసర్గమువలన అరకుసారాయము త్రాగుటకూడా వీరికి అలవాటు అయినది. బియ్యముతో సారాయమును తయారు చేయునప్పుడు దానిని ముందుగా పితృదేవతలకు నైవేద్యము పెట్టుదురు.

## కుకీ జాతివారు

అస్సాములోని లుషాయి కొండలలో జీవించు 'కుకీ' జాతి వారు నాగరకతయందు చాలా వెనుకబడి యున్నారు. వీరు లుషాయీ జాతిలో చేరినవారే. వీరు దుర్గమారణ్యములమధ్య నాలుగైదు పాకలచొప్పున ఇండ్లు వేసికొని జీవింతురు. మొగవారు 7 అడుగుల పొడవు 6 అడుగుల వెడల్పుగల ఒక వస్త్రము ధరించి ఒక తెల్లనిచొక్కా తొడుగుకొందురు. వారి నాయకుని తలపాగపైన బొంతకాకి (King crow) యీకలు ధరింతురు. అడువాండ్రు నడుముక్రింద నొక చిన్న వస్త్రము

చుట్టుకొందురు. స్తనములను మాత్రము తప్పక కప్పుకొందురు. కుకీజాతి ఆడపిల్లలు దినమెల్లతో తిరుగుచున్నను స్తనములుమాత్రము కనపడకుండ ఒకగుడ్డ చుట్టుకొందురు లుషాయీ అడవులందు వెదురు విశేషముగా పెరుగును. అందువలన నీజాతివారు అన్నివస్తువులను వెదురుతో చేసికొందురు. వారి పనిముట్లు, పరికరములు, పాత్రలు, ఇండ్లు వాకిళ్ళు వెదురుతోనే తయారుచేయుదురు. ఆడవాండ్రు పెద్దవెదురు గొట్టములను బుట్టలలో పెట్టుకొని నీరు తెచ్చుకొందురు.

అస్సాము అడవులందు అడవి యేనుగులు విచ్చలవిడిగా తిరుగుచుండును. లూషాయీ జాతివారు వీనిని పట్టుకొని మచ్చికచేసి అడవులలోని కలపను లాగుటకు వ్యవసాయము చేయుటకు నుపయోగింతురు. అక్కడ ఎనుబోతులు, దుప్పులు అసంఖ్యాకములుగా నున్నవి. పెద్దపులులు, చిరుతపులులు, ఏదుబందులు ఎలుగుగొడ్డులు మొదలైనవికూడా యథేచ్ఛగా తిరుగుచుండును. కుకీలు వీనిని వేటాడుచుందురు. వారి ఆయుధములలో ముఖ్యముగా విల్లమ్ములు. "[illegible]" ఆకారముగల పొడవైన కత్తులు, బర్మావారుపయోగించు డావ్ (Dao) అనబడు పట్టాకత్తులు; కుకీలు ఎనుబోతు చర్మముతో డాళ్ళుచేసి వానికి పైకొనలందు ఎర్రని రంగులో ముంచిన మేకపోతు బొచ్చును కుచ్చులుగాచేసి కట్టి అలంకరింతురు. ఇదిగాక వాడియైన వెదురు కర్రల శూలములను కూడా వారాయుధములుగా చేసికొని యుపయోగింతురు.

కుకీజాతివారిలో అడవియందు తిరుగువారు వెదురు తడికల గోడలు పైకప్పులతో నొక చక్కని ఇంటిని కొన్నిగంటలలో నిర్మించుచుందురు. యిండ్లకప్పులకు వెదురు ఆకులను దట్టముగావేసి వర్షము రాకుండా చేయుదురు. స్థిరముగా నొకచోట నివసించువారు ఏబది యడుగుల పొడవు పదునైదు ఇరువది యడుగుల వెడల్పు ఏడు మొదలు పదియడుగుల యెత్తునుగల విశాలమలైన ఇండ్లను వెదుళ్ళతో నిర్మించుచుందురు. వీరు వెదుళ్ళతో చేయని వస్తువులేదు. గంపలు, చాపలు, చేపల వలలు, నేతమగ్గముల పరికరములు, పొగచిల్లు చిలుము గొట్టములు, సంగీత వాద్యములు అయుధములు కుడుకు వంటపాత్రలు

కూడా వీనితో నిర్మింతురు. నదీప్రవాహముల పైన వెదుళ్ళతో వంతెనలు నిర్మింతురు. లేతవెదురు మొవ్వలను బియ్యముతో నుడికించి అహ్లాదము మగా భక్షింతురు.

కుకి తెగలోని "దార్లంగు"లు వెదురుటడవులను కాల్చి ఒకటి రెండేండ్లు "ఝుం" అను పోడువ్యవసాయమును చేసి మరల నింకొక చోటికి పోవుదురు. ఒక అడవిని ఛేధించునపుడు వారు మధ్య నొక చెట్టును వదలుదురు. ఆ పొలముల చుట్టుప్రక్కలనున్న శక్తి ఆ చెట్టు నావహించి పంటకాలమున చేనుకు లాభము కలిగించునని వారి నమ్మ కము. వారికి పల్లపు సాగుపద్ధతులు తెలియవు. అందువలన కుకిలదేశ ములో కొన్ని చోటులలో సంతాలజాతి కూలివారిని పిలిపించి పల్లపు సాగుపద్ధతి నలవాటు చేయుటకు కొంత ప్రయత్నము జరిగెను. వర్షము లు కురిసినప్పుడు కుకీలు దానిలో తడిసినచో వ్యవసాయమునకు మంచి దని తలచి అట్లు చేయుదురు. వారు నృత్యములు చేసియు బలులిచ్చియు కృషినభివృద్ధి చేసికొనజూతురు. వీరికి పొదుపరితనము లేదు. పంటలు పండినప్పుడు రెండుపంటలమధ్య తమకు చాలినమట్టుకు మాత్రమే తీసి కొని మిగిలినపంటను పశువులకు వదిలివేయుదురు. పంటలు వచ్చిన రెండునెలలగునప్పటికి వారు తెచ్చుకొన్న ధాన్యముతో సారాయము తయారుచేసి దానిని వ్యర్థపరచి కొందురు.

ఖారియాలు, దార్లింగు - కుకీజాతివారు ఉభయులును నాగరకత పోకనివారే ఈ రెండుజాతులవారును తాము జీవించు దేశపరిస్థితిని బట్టి తమ జీవితవిధానమును చాలా నేర్పుతో సరిదిద్దికొనినట్లు కనబడు చున్నది. కుకీలకు వెదురుటడవులవలెనే ఖారియాజాతివారికి సాలవృక్ష ముల అడవులుపయోగించుచున్నవి. అందువలన సాలవృక్షపు పూతను ఖారియాలు చాలా పవిత్రముగా నెంచుదురు. కుకీజాతివారు వెదురు టడవులను పవిత్రముగానెంచి అందే తమ దైవములు వసించునని విశ్వసింతురు. *

* Races and Cuitures of India. By D. N. Mazumdar kitaibstan, Allahabad pp 65–83.

# నా గ జా తి వా రు

1942 వ సంవత్సరము జూలై 5 వ తేదీన క్రిస్టోఫ్ వాన్ ఫ్యూరర్ హెయిమెన్ డార్ఫ్ (పి. హెచ్. డి.) గారు మద్రాసులోని హిందు పత్రికలో భారతదేశపు తూర్పు సరిహద్దునగల నాగజాతివారిని గూర్చిన ఒక అపూర్వవ్యాసము వ్రాసిరి. "రెండవ ప్రపంచయుద్ధ సందర్భముననే అస్సాము బర్మాల సరిహద్దునగల నాగజాతివారి కొండలనుగూర్చి నాగరిక ప్రపంచమునకు తెలిసినది. అంతకుముం దక్కడి పరిస్థితు లెవ్వరికి తెలియవు. అవి దుర్గమారణ్యములు. ఆ జాతివారిని జూచిన అందరికిని భయమే. మణిపూరురోడ్డు ఈ కొండలపైపునకు దక్షిణముగా పోవుచున్నది. ఉత్తరమునసున్న భాగ మగమ్యగోచరమైన ప్రాంతము. బ్రహ్మపుత్రానదికి దగ్గర పడమరనున్న కొండలలో వసించు 'అంగామి' నాగజాతివారు మొదలైనవారు జీవించు ప్రాంతము మాత్రము ఇంగ్లీషువారి పరిపాలిత రాజ్యములో చేరియుండెను. తక్కిన దేశము దుర్గమమై దారి తెన్నులు లేని ప్రాంతము. ఇందులో దాంగులు "కాల్యకెంగ్యూలు" మొదలైన జాతులవారు నాగరక ప్రపంచముతో సంబంధములేకుండా జీవించు ఆదిమ ఆటవికజనులు నున్నారు.

ఈ ప్రాంతములకు బోవుటకు పాశ్చాత్యులుగాని ఇతర భారతీయులుగాని సాహసింపలేదు. రెండవ ప్రపంచ సంగ్రామ సందర్భమున పట్కాయి పర్వతములలోనికి ఇంగ్లీషు సైనికాధికారవర్గమొకటి బయలుదేరెను. వానితో మన వ్యాసకర్త పోయిచూచుట తటస్థించెను.

ఇంగ్లీషు పరిపాలిత ప్రాంతమునుండి వంకరటింకరగా తిరుగు పర్వతపంక్తుల పైన ప్రయాణములు చేయుచుండగా ఏడువేల అడుగుల ఎత్తున కొన్ని గట్టులుదాటి నదీప్రవాహములపైన నూగులాడు వెదురు వంతెనలపైన ప్రాణములర చేతబెట్టుకొని దాటిపోవగా అక్కడ అత్యా

---

* Head hunters of India's Eastern Frontier By Baron Christoph von Furer Haimenndorf; The Hindu 5. 7. 1942

శ్చర్యాకరమైన ప్రకృతి దృశ్యములను అపూర్వమయిన నాగజాతి నాగరికతా చిహ్నములను కనబడినవి.

అక్కడి కొండకోనల పైన చుట్టును కర్రలతోను వెదుళ్ళతోను నిర్మింపబడిన రెండువరుసల ఆవరణ దడిగోడలు వానిచుట్టును కందకములు వానిలోనికి చొచ్చుటకు వీలులేకుండా ముళ్ళకంపలు దుర్భేద్యములైన కోటలవలె నుండెను.

ఈ ఆవరణంలోనికి పోవుటకు సన్నని వెదురు వంతెనలుగల ద్వారము ఉండెను. వెదుళ్ళతోను పేముబెత్తములతోను చేసినవంతెనలను తీసివేయుటకు వీలుగా నుండెను. యుద్ధసమయములందు శత్రువుల రాకను కనిపెట్టుటకై చెట్లపైన అమర్చిన గదులుండెను. ఈ కోటగోడలలో మధ్య దగ్గర దగ్గరగా నిర్మింపబడిన ఇండ్లుండెను. వాని పైకప్పులు వీధులలోనికి వ్యాపించియుండెను. యిండ్ల పైకప్పుల నన్నిటిని తలదన్నుచు ఆకాశములోనికి చొచ్చుకొని వచ్చిన పంగల కొమ్ములవలె కనబడు పైకప్పుగల క్రీడాగృహము లేక గ్రామచావడి (Club house) కనబడుచుండెను, ఈ గృహము నాగజాతివారికి ఒక సభాభవనముగాను బ్రహ్మచారుల శయన మందిరముగాను ఉపయోగించుచుండెను. ఈచావడిలోనే నాగజాతి వీరులు తెచ్చిన పుఱ్ఱెలను గోడలకు వరుసలుగా అమర్చియుంచిరి. వాటిని త్రాళ్ళతో వ్రేలాడకట్టుదురు. మధ్యమధ్య అడవిగొఱ్ఱెగేదెల కొమ్ములను అలంకారముగా నమర్చి యుంచిరి.

కొన్ని గ్రామములలో క్రొత్తగా కొట్టితెచ్చిన మానవ శిరములను చెట్లకు వ్రేలాడగట్టగా వాని చర్మములు ఎండి పుఱ్ఱెల కంటుకొనిపోయి వెరగు నవ్వుతో భీకరముగా కనబడుచుండెను.

పట్కాయికొండల నాగజాతివారికి పుఱ్ఱెలను సంపాదించుకార్యము చాలా ముఖ్యమైన కార్యముగా నుండెను.

చాంగులు కాల్యో కెంగ్యూలు మొదలైన నాగజాతివారు ఇప్పటికిని మానవులను చంపి వారిపుఱ్ఱెలను ప్రోగుచేయు ఆచారము కలిగియున్నారు. ఈ పుఱ్ఱెలలో మంత్రప్రభావమున్నదని, దానివలన పంటలు బాగా పండునని వారి గ్రామములకు క్షేమలాభములు కలుగునని వారి

విశ్వాసము. బ్రిటిషువారి పరిపాలన క్రిందనుండిన ఆటవికజాతులు నివసించు ప్రాంతములో పుఱ్ఱెల సంపాదనము నిషేధింపబడెను. దీనివలన ఆ గ్రామములోని యువకుల శౌర్యము వీర్యము అడుగంటినవనియు పంటలు సరిగా పండుటలేదనియు నాగజాతి వృద్ధనాయకులు వగచిరి.

మానవులను వధించి పుఱ్ఱెలు ప్రోగుచేయు క్రూరాచారము నవలంబించువారైనను అట్టి ఆచారమును మానినవారైనను నాగజాతి వారందరు ఉత్సాహవంతులును ఆటపాటలన్నను అలంకరణములన్నను అందమైన వస్తువులన్నను ప్రీతికలవారునై యున్నారు. వారు దృఢగాత్రులు సుందరమైన శరీరముకలవారు; ఒయ్యారముగా నడచువారు సౌందర్యము, రంగులలోని అందము స్త్రీ పురుషులను రంజించును వారు పువ్వులతో నలంకరించుకొందురు. యువకుల చెవితమ్మల కన్నములలో అందమైన పువ్వులనుదోపుకొని తలలో కొయ్యదువ్వెన సూదులు (hair pins) ఎఱ్ఱని రంగువేసిన మేకబొచ్చు తురాయిలను ధరింతురు. వారు తమ మెడలో ధగధగ మెరయు అడవిపంది కోరల పేరులను ధరింతురు. ముంజేతులకు కాళ్ళకు రంగువేసిన పేమువరలను వేసికొందురు. నడుములకు వెడల్పైన చెట్లబెరళ్ళ పటకాలు పెట్టుకొని వానికి ఆకుపచ్చని రంగు గల నగిషీలు అద్దుదురు. వానినుండి నీలిరంగు గుడ్డలు వ్రేలాడుచుండును. శుభసమయములందు వారు ఎరుపు నలుపు మేకబొచ్చు కుచ్చులు హారన్‌బిల్ అను పక్షియొక్క రంగురంగుల పింఛములు (tail feathers of horn bills) తమ శిరోవేష్టనములందు వ్రేలాడుచుండగా పొడుగైన ఈటెలను గంద్రగొడ్డళ్ళను వయ్యారముగా త్రిప్పుదురు.

ఆడువాండ్రుకూడా ఆదేవిధముగా అలంకరణములను ధరింతురు. వారు మెడలో అనేకవిధములైన హారములు, చేతులకు రంగురంగుల కంకణములు ధరించి ఒకమూరకన్న హెచ్చు వెడల్పులేని అందమైన పరికిణీలు, తాము స్వంతముగా మగ్గములపైన తయారుచేసి కట్టుకొందురు. గద్దిగాగరాలను ధరింతురు. కొన్యాకు నాగజాతివారి ఇత్తడి ఇనుప వస్తువులుచేయు కంచరులు కమ్మరులు చాలా నేర్పరులైన పనివారుగా

మున్నారు. కర్రలపైనచెక్కడపు పనులుచేయు వడ్రంగులు శిల్పులందరిలోను సిద్ధహస్తులని చెప్పవచ్చును. అనేక మానవ శిరములను పుత్తెలను నరికి సంపాదించిన వీరుల వక్షములపైన ధరించుటకై కొయ్యపైన చెక్కిన పుత్తెల బొమ్మలను వీరు చాలా పనివానితనముతో చేయుదురు. సమష్టి క్రీడాగృహములం దనేకవిధములైన శిల్పములను శిరణపువనిని చూపుదురు. ఇంటిలోపలి కప్పులలో వాలి కూర్చున్న (horn bill) "హారన్ బిల్" పక్షి బొమ్మలు, తెలుపు ఎరుపు, నలుపురంగులలో ఇంటిచూరు వెంబడిని మనుష్యులబొమ్మలు పశుపక్ష్యాదుల బొమ్మలును చాలాచక్కగా చెక్కుదురు. పెద్ద స్తంభములలో సజీవప్రమాణము ఆకారముగల చిఱుతపులుల బొమ్మలు, నాయికానాయకుల శృంగారవిగ్రహములు చెక్కుదురు. వాని ముఖములందలి హావభావచేష్టలు, వానినదక సజీవమైన వానివలె నుండును. నాట్యము చేయుచున్న ఒకజత బొమ్మలను ఇంగ్లాండులో ప్రదర్శింపగా వానియందము చూచి అక్కడి శిల్పులాశ్చర్యపడిరి.

నాగజాతివారు వ్యవసాయముచేసి బ్రతుకువారేగాని వారికి నాగలితో దున్నుటగాని ఎడ్లనుపయోగించుటగాని తెలియదు. చక్రములబండిని వారు చూచి ఎఱుగరు. వారు తమ గొడ్డళ్ళతోను తొల్కిక పార (hoe) తోను కొండల ఏటవాలు ప్రదేశములలో వ్యవసాయము చేయుదురు. ఇంత శ్రమపడుచు శిల్పకళయందు ప్రావీణ్యము చూపుటకు వారికి తీరిక ఎట్లు కలిగెనో గ్రహించుట కష్టము. ఈ నాగజాతివారి సాంఘిక వ్యవస్థ కూడా చాలా అపూర్వమైనది. స్త్రీ పురుషులకు వృత్తి స్వాతంత్ర్యమన్నది. సంఘసేవ యన్నను ప్రీతి. వారిలో ఔదార్యము, దాతృత్వము కలవు. అతిథులను వారు సంతృప్తులను చేయుటకు ప్రయత్నింతురు. కేవలము ధనమును ప్రోగుచేసికొనుటగాక సంఘసేవ చేసిన గొప్ప సందర్భములలో దానిని ధారాళముగా వ్యయము చేయుటనే వారు గౌరవింతురు. ఆటవిక జాతుల సమాన స్వాతంత్ర్యములను నిలువబెట్టుటకు వారు యావచ్ఛక్తిని వినియోగింతురు. అయితే వారికి గురువులుగా సంఘ

అంగ్, వాంగ్ వాయకుల మాటను జవదాటరు. వారికి గొప్ప మంత్రశక్తి యున్నదని నమ్ముదురు.

## కోల్ జాతివారు

వంగదేశమున రాజమహల్ కొండలలోను సంతాలు పరగణాల లోహ ఇనుము కరిగించు కమ్మరిపని చేయువారు కోల్ జాతివారే. ఛోటా నాగపూరులో కూడా కొంతమంది కోల్ జాతి కమ్మరులున్నారు. కోల్ జాతివారి పూర్వచరిత్ర తెలిసికొనుటకు చరిత్రధారములు కనబడుట లేదుగాని వారు సంతాలుజాతికి సన్నిహితులగు ఆదివాసులనుటకు సందేహములేదు. ఛోటానాగపూరులోను రాజమహలు కొండలలోను జీవించు అనేక ఆటవికజాతులు కోలులేక కోలారుజాతివారే. ఇందులో ముండాజాతివారు "హో" జాతివారు. వీర కోల్ జాతివారు, భూమిజ్ కోల్ జాతివారు, సంతాలీ లేక సొంతాలీ జాతివారు అనుశాఖల వారున్నారు. వీరి రూపురేఖావిలాసము లొకేతీరుగా నుండును. వారిభాష తెలుగు కన్నడము అరవములకు సన్నిహితసంబంధము కలిగియున్నది. సంతాలు పరగణాలలో కమ్మరిపని చేయు కోల్ జాతివారిని సంతాలులు నీచముగా చూచుట పరిపాటియయ్యెను. వారికన్న తాము ఉన్నతజాతి వారమని వారు చెప్పసాగిరి *

సంతాలు పరగణాలలో కమ్మరిపనిచేయు ఆదివాసులు 1807 నాటికి చాలా హీనస్థితిలోనికి దిగిపోయిరి. ఆపని చేయుట పరువుతక్కువ యని సంతాలులుతలచిరి. 1807లో ఫ్రాన్సిస్ యికానసే అనునతడు, కమ్మరిపని చేయు ఆదివాసులు చాలా పిరికివారుగాను అమాయకులుగాను అజ్ఞానులుగాను ఉన్నారని వ్రాసినాడు. పూర్వము సంతాలు జాతివారు ఇనుముతో ఉక్కుతో చేసిన ఆయుధములను పరికరములనేగాక మేలైన ఉక్కుతో చేసిన వానిని ఉపయోగించుచుండిరి. ఇంగ్లీషు కుంపెనీవారు సీమనుండి

* A monograph on Iran and Steel in Grorice of Bensal. By E R Watson M A Bs Sc IES. PP 25. 26-Bengal Govt Calcutta 1907.

టక్కు సామాను ఆయుధములు దిగుమతిచేసి ఈ పరిశ్రమను నాశనము చేసిరి. పూర్వము తుపాకిగుండ్లు దూరలేని టక్కుదాళ్లు సంతాలు జాతి వారు తయారుచేయుచుండిరి. ఇవి చాలాప్రసిద్ధి చెందియుండెను. ఆంగ్లే యుల రాజ్యాధిపత్యము వచ్చిన పిమ్మట వారి కుటిలరాజ్యనీతి యొక్క ప్రభావమువలన నీవిద్య క్రమక్రమముగా అంతరించెను. ఇట్టివిప్పుడు తయారగుటలేదని సంతాలు పరగణాలను గూర్చిన నివేదికలో వ్రాయ బడినది. *

## గోండులు - కోయలు

పూర్వపు హిందూదేశ పటములలో మధ్యభారతమునందు అడవు లతోను కొండలతోను నిండి అనిర్దిష్టమైన సరిహద్దులు గల విశాలదేశము గోండ్వనమని చూపబడుచుండెను. గోండులజాతివారుండు దేశము ఉత్తరమున వింధ్యపర్వతములనుండి దక్షిణమున గోదావరివరకును తూర్పున కటకముపైన నాధారపడిన మహాళ్ళు అనబడు ఖోండుదేశము నుండి పడమర భిల్లుల దేశము వరకును ఖాందేషు మాల్వాములవరకును వ్యాపించియుండెను.

వంగరాష్ట్రమునకును బీహారునకును పడమర ప్రక్కనుండి అల హాబాదు క్రిందుగా మీర్జాపురము దగ్గర వింధ్యపర్వతములవఱకును వ్యాపించియున్న అరణ్యప్రదేశమునందు కోల్ జాతివా రుండిరి.

వంగదేశమున ఉత్తరము తూర్పు పరిహద్దుల నంటియున్న జిల్లా లైన రంగపూరు అస్సాము అరకానములలో చాలా అనాగరకులైన జాతు లవారుండిరి. బంగాళము ఒరిస్సాలదగ్గర సంతాలు పరగణాలలో సంతా లులు ఒరిస్సాలో కటకము తాబేదారిమహాళ్ళలో ఖోండుజాతివారునుండిరి.

ఇంగ్లీషు పరిపాలనలో మధ్యరాష్ట్రములుగానుండిన దేశములలో చాలాభాగము పూర్వము గోండ్వనమని వ్యవహరింపబడుచుండెను. 12 వ శతాబ్ది మొదలు 18 వ శతాబ్ది వఱకు నాదేశము నేలిన "గోండు" రాజ

* Ibid P. 52

వంశమువారి వలన నాదేశమున కాపేరు వచ్చినది - గోండులాదివాసుల జాతివారే. వీరు తమను "కోయిటురు"లు లేక కొండవారమని వ్యవహరించుకొందురు. వీరి భాష దక్షిణదేశములోని తెలుగు అరవ భాషలను పోలియుండును. అయితే అందులో హిందీ పదములు చాలా యుండును. 1926 జనాభా లెక్క ప్రకారము భారత దేశమున 2110000 గోండు లుండినట్లు తెలిసినది. వీరిలో రాజగోండులనువారు రాజపుత్ర వంశీయులై ఈ దేశము నేలిరి. చాలా కోటలను కట్టిరి. తటాకములు నిర్మించిరి. వీరు చాలా ధైర్యసాహసములు కలవారు. నాగరికతవలని దుర్గుణములు అలవడని గోండులు చాలా నీతిపరులుగా నున్నారు. గోండ్వన రాజ్యము మహారాష్ట్ర నాగపూరు రాజుల పరిపాలనలో చేరి కొంత 1818లో ఇంగ్లీషువారి వశమైనది. నాగపూరురాజును పదచ్యుతుని చేసిన పిమ్మట 1853 లో పూర్తిగా ఇంగ్లీషువారి వశమైనది. *

మధ్యరాష్ట్రమునకును ఒరిస్సాకును మధ్య "తూర్పు ఏజన్సీ" అని బ్రిటీషు పరిపాలనకాలమున వ్యవహరింపబడిన రాజ్యభాగమునందు గల బస్తరు సంస్థానములో గోండుజాతికి చెందిన మరియా, మురియా, వర్లా, భత్ర, గదబ జాతుల ఆదివాసులు లేక ఆటవికజనులున్నారు. బస్తరు సంస్థానములోని చాలా గ్రామములు స్వయంసమృద్ధములుగా నున్నవి. ప్రతిగ్రామములోను గాని కొన్ని గ్రామములకు కలిసికాని ఒక కమ్మరి యుండును. ఈ కమ్మరులు చాలా నేర్పుకలవారు. ఆదివాసుల జాతులవారి నాగళ్ళకు ఇనుపమొనలను మంచి ఆరుగల గొడ్డళ్ళను, వాడియైన ఇనుపమొనలుగల అమ్ములను వీరు తయారుచేయుదురు. ఈ కమ్మరు లీయాదిమవాసుల జాతివారేగాని అన్యులుకారు.

గంజాము జిల్లాలోని సవరజాతివారిలో మంచి నేతగాండ్రున్నారు. బస్తరులోని కొన్ని మతములవారు చేపలు పట్టుదురు. ఇట్లు భారతదేశములోని గ్రామజీవనము కులవృత్తుల విధానము నీ ఆటవికులలో వ్యాపించి యున్నది.

---

* Encyclopaeda Britannica

గోండుజాతివారు పరిసర గ్రామములందు జరుగు సంతలకు పోయి అక్కడ తమకు కావలసిన వస్తువులు తెచ్చుకొందురు. వారి స్త్రీలు ధరించు కంకణములు, ఉంగరములు, చెవులపోగులు హారములు మొదలైన ఆభరణములు, పూసలపేర్లు మొదలైన వాటిని పరిసర ప్రాంతపు వర్తకులు తెచ్చి అమ్ముచుందురు. గోండుజాతివారిలో కొన్ని శాఖలలో పచ్చబొట్టు పొడుపించుకొను పద్ధతి చిరకాలమునుండి యున్నది. వారు తలవెంట్రుకలను తెల్లని వెదురు దువ్వెనలతో దువ్వుకొని జుట్టును చాలా అందముగా ముడిచి అలంకరించుకొందురు. గోండుజాతివారు కూడా అస్సాములోని కుకీల వలెనే పోడువ్యవసాయమును చేయుదురు. అడవులు గల కొండల ఏటవాళ్ళలో కూడా వారు వ్యవసాయము చేయుదురు. తెలుగుమీరిన గోండుజాతి వ్యవసాయకులలో తమ పంటకొలకు మంత్ర తంత్రములు, పూజలు, ఆరాధనలు, ప్రార్థనలు అభివృద్ధిగాంచినవి. క్రమ క్రమముగా నాగరకత వ్యాపించినచోట్ల నాణెముల రూపమున కూలి సంపాదించుట ప్రారంభించినారు.

శబరులు (సవరలు), కోయలు (కోదులు) జాతవులు, కొండదొరలు, చెంచులు, కొలవలు (ఎఱుకలు) యేనాదులు లంబాడీలు మొదలైన ఆటవికజాతులవా రాంధ్రదేశమున చిరకాలమునుండి యున్నారు. వీరు హిందూదేశములోని ఇతర ప్రాంతములందుకూడా వ్యాపించియున్నారు. ఉత్తర దక్షిణభారతదేశములలోని ఆటవిక జాతులవారందరికి కొన్ని పోలికలున్నవి. కొన్ని సామాన్యాచార వ్యవహారములున్నవి. కాని భాషలుమాత్రము వేరుగా నున్నవి. ఎఱుకలు ఎఱుకచెప్పుట, బుట్టలల్లుట, మందులమ్ముట బిచ్చమెత్తుట చాలామందికి తెలియును. అయితే వీరిలో చిల్లరవ్యాపారము చేయుచు జీవించువారుకూడా ఉన్నారు. సముద్రతీరమునుండి దేశము లోపలిప్రదేశములకు ఉప్పు తీసికొనిపోయి అమ్ముదురు. ఇంతేగాక వీరు అడవులలో దొరకు వెదురుబద్దలతో అల్లిన బుట్టలు కురువేళ్ళు మొదలైనవానితో చేసిన కుంచెలు, ఓషదులు, మూలికలు అమ్మదురు. పిట్టలవేట దుప్పివేట చేయుటలో వీరు నిపుణులు. వీరిలో దొంగతనము దోపిళ్ళు చేయువారుకూడా ఉన్నారు.

బ్రింజారి, బంజారి, బోయిపారి, సుగాలి, లంబాడీ లనువారిని అటవికజనముగాను, దొంగతనములుచేయు జాతిగాను ఇంగ్లీషువారు పరిగణించిరి. వీరు పూర్వము ఎడ్లపైన సరకులు వేసికొని బిడారులుగా వేలకొలది ఎడ్లతో, ఆయుధపాణులై దేశములోని అడవులు కొండలు దాటి వాణిజ్య వ్యాపారములను చేయుచుండిరి. ఉప్పు పోక చెక్కలు మొదలైన సరకు లుత్పత్తియగుచోటికి వెళ్ళి తెచ్చి దేశములో అన్నిప్రాంతములకు తీసుకొనిపోవుచుండిరి.

మొగలు చక్రవర్తులు దక్షిణ దిగ్విజయ యాత్రలు చేసిన కాలములో వారి సైన్యములకు కావలసిన ఆహారపదార్థములు, ఇతర సామానులు యుద్ధసామగ్రిని ఎడ్లపైన వేసికొని వచ్చి యుద్ధానంతరము దక్షిణదేశములోనే దిగబడిపోయిరి.

ఇంగ్లీషు కుంపినీవారీదేశమున సర్వమక్తా వ్యాపారముల నారంభించి సామాన్య జనుల జీవనాధారములను నాశనముచేయుటతోపాటు ఈ అటవిక జనుల వృత్తులను పరిశ్రమలను వ్యాపారములను కూడా నాశనము చేసిరి. అంతట జీవనాధారము లేక వీరు బిచ్చమెత్తుట దొంగతనములు చేయుట ప్రారంభించిరి. ఇంగ్లీషువారు నాగరకప్రాంతమునకు వచ్చిన ఆటవికజనులను నేరములుచేయు జాతులలో వారినిగూడ చేర్చి నిర్బంధము ఏర్పరచి శాసన విధులను చేసిరి.

## ఆదివాసుల జనసంఖ్య

1931 సంవత్సరము జనాభా ప్రకారము మన దేశమున వివిధ ఆదివాసులు ఈ క్రిందివిధముగా వర్గీకరింపబడిరి.

1 గోండు, ఖోండు కొండ, దొర కోయ, మరియా, మురియ, నాగార్చి, జాతులవారొకే ఆదిమవాసుల శాఖకు చెందినట్లు వర్గీకరింపబడినారు. ఈజాతివారు అండమాను నికోబారు దీవులలోను, బంగాళము, బీహారు, ఒరిస్సా, బొంబాయి, మధ్యరాష్ట్రములు, బీరారు, మద్రాసు,

అయోధ్య. ఆగ్రానంయుక్తరాష్ట్రములు. మధ్యభారతము. హైదరాబాదు. గ్వాలియరు. రాజపుత్ర స్థానములందున్నారు.

వీరి సంఖ్య 4719222

2. గారో. హజాంగు. కచరి. మెచ్. రభి. జాతివారు అస్సాము. బంగాళారాష్ట్రము లందున్నారు.

695048

3. బేదరులు. బోయలు. బొంబాయి. మద్రాసు. హైద్రాబాదు రాష్ట్రములలో

991536

4. బయిగా. భైనా.బింజ్వార్. భారియ. కదరు. భూమియ. భుంజీయ. భుయ్యా. ఘట్వార్. నయ్యా. పయో. జాతుల వారు బంగాళము. బీహారు. ఒరిస్సా. మధ్యరాష్ట్రము మధ్యభారతము. రాజపుత్రస్థానము. సిక్కిములలో.

1050760

5. భిల్లులు. బరెల భిల్లాల. ధంకా. మంకర్ మావ్చి. పరియ. రతియ. రాత్వీజాతివారు చాలా రాష్ట్రములందు

2454144

6. ముందా. మవాసి. హో.కోల్. ఖర్వార్. ఖర్యా. భొగ్టా. భూమిజి కొర.జాతివారు. బీహారు ఒరిస్సా. బంగాళము. మధ్యరాష్ట్రములు. డీరారు. మధ్యభారతము. సంయుక్త రాష్ట్రము లందున్నారు.

2315276

7. సంతాలు. హొంట. కర్మాలి. జాతులు బంగాళాదేశము. బీహారు. ఒరిస్సా. మధ్యభారతము లందున్నారు.

2524475

* Statistical Abstract.

8. సవర, సౌనర్, సపర్, సహారియ జాతులవారు బీహారు ఒరిస్సా, మధ్యరాష్ట్రము, మధ్యభారతము, రాజపుత్ర స్థానము, గ్వాలియరులలో నున్నారు.

675628

## ఆ ది వా సు లు

అస్సాంరాష్ట్రములోని ఆదివాసులు :

గారో; లూషాయి; కుకీ;

మికిర్; అబోర్; దఫ్లా జాతివారు

అంగామినాగ; సెమనాగ; చంగ్‌నాగ; లోహిటానాగ; కొన్యాకనాగ జాతివారు.

ఖాసీజాతివారు.

వంగరాష్ట్రము; బీహారు :

పోలియా; మేలెర్; ఒరోయన్; సంతాలు; ముండా; హో; జాతులవారు.

ఒరిస్సా; మద్రాసు; (ఆంధ్రప్రదేశము)

ఖోండు; సవర; చెంచు; లంబాడి; సుగాలి; కోయ; కోట; బడగ జాతులవారు.

బొంబాయి :- భిల్లులు; కటకారి; కోలి;

మధ్యభారతము ఏజెన్సీ : గోండులు; (మురియ, మరియా; భత్రా; ప్రజ) జాతివారు.

మధ్యరాష్ట్రము, కోయ; కొర్కు జాతివారు

ష. రా. భారతదేశములో మూడుకోట్ల ఆదివాసులున్నట్లు హిందువుల వర్ణాశ్రమ ధర్మములో చేరని జాతులవారు 6 కోట్లున్నట్లుఅంచనా.

**Races and Cultures, D. N. MUZUMDAR p 258.**

హైదరాబాదు రాజ్యము (ఆంధ్రప్రదేశము)

గోండులు; మరియ; మురియ; భత్ర; ధృవ, గదబ

ఉత్తరప్రదేశము (అయోధ్యా, ఆగ్రా సంయుక్తరాష్ట్రములు)

తారు; భొక్స; ఖాస; కొర్వ; బియరు; ఘుయ; మఝ్వా; చెరో; ఖర్వారు, రాజి.

పశ్చిమోత్తరపు సరిహద్దు : ఆప్గనులు బెలూచీలు.

భారతదేశములోని ఆదివాసుల జనసంఖ్య రమారమి ఒకకోటి తొంబది లక్షలున్నది. నేరములుచేయు జాతులని ఇంగ్లీషువారు వర్గీకరించినవారి సంఖ్య 40 లక్షలున్నది.*

---

Races and cultures D. N. Muzumdar P 104

* Second Five Year Plan; Govt of India; 1956 page 558

# 3. ఆదిమవాసుల మతధర్మములు

ప్రకృతియందును మానవజీవితమునందును ఆకస్మికముగా కలుగు మార్పులును సంఘటనలును ఒక తీరుతెన్నులు లేకయుండుట చూచి వీనిని లోబరచుకొని హద్దులోనుంచి వానికొక క్రమపద్ధతి నేర్పరుప వలెనని మానవులు మొదటినుండి ప్రయత్నింపసాగిరి. దానిని గూర్చి ఆలోచింపగా అణువు మొదలు మేరువువరకు చేతనా చేతనములగు సమస్త ప్రకృతి, జీవజంతుజాలము, వృక్షములు, రాళ్ళు రప్పలు సహితము అకర్తృకము నతీంద్రియమునగు శక్తులకు లోబడియున్నట్లు అట్టి శక్తులతో నిండియున్నట్లు తోచెను. ఇక విశాలాకాశమున కనబడు సూర్య చంద్రులు, నక్షత్రములు, ఒక్క క్షణములో మహావృక్షమును పెల్లగించు వాయువు, దేశమును ముంచివేయు వర్షము నదులు నీశక్తితో నిండియున్నట్లు ప్రత్యక్షముగనే కనబడెను. ఈ శక్తి యొక్క శక్తిమైనది లేక అనేక శక్తులైనది అర్థముకాలేదు. అతీంద్రియము అకర్తృకమునగు నీ శక్తికి "మన, వాక్వ, టొంగ," అని ఆదివాసులు పేరుపెట్టి దీనిని ఉద్దీపనముచేయుటకు, ప్రేరేపణము చేయుటకు ప్రయోగించుటకు ఉపసంహరింపజేయుటకు మార్గములన్వేషింప సాగిరి.

మతమనగా పవిత్రమైన విషయములను గూర్చిన నమ్మకమును వానికిసంబంధించిన కర్మకాండయునని డుర్హైయిమ్ (Durhaim) చెప్పియున్నాడు. కేవలము నమ్మకములతో మాత్రమే మత మేర్పడజాలదు. దానికి శక్తినిచ్చునది కర్మకాండయే. మంత్ర తంత్రములు మతమునకు చాలా సన్నిహిత సంబంధములు కలిగియుండును. అకర్తృకము నతీంద్రియమునగు శక్తియందు గల, భక్తి విశ్వాసముల వలననే మంత్ర తంత్రముల యొక్క బలమునేర్పడి ప్రజలకు వానియందు భక్తి విశ్వా

వము లేర్పడును. దివంగతులైనవారి నారాధించుట వారిని తృప్తిపర చుట యనునది వారిలోనున్న అతీంద్రియము నకర్తృకమునగు శక్తిని పూజించుటయే. ఇది ఆదిమానవులయందు ఆటవికజనులయందు సర్వసా మాన్యమైన మతాచారముగా నున్నది.

వన్యమృగములందు సర్పములందు పక్షులందు వృక్షములయందు నదులందు కొండలందు తుదకు రాయిరప్పలందుకూడా ఈ శక్తులున్న వని వారు విశ్వసింతురు. ఇవన్నియు నాధ్యాత్మిక చిహ్నములుగా నెంచి వానిని పూజించి ఆ శక్తిని తృప్తి పరుపఁజూతురు.

ఆదిమవాసుల జాతివారు తమ తోడిమానవులతో ప్రత్యక్షమును పరోక్షమునైన సంబంధము నేర్పరచుకొనునట్లే అతీంద్రియ అకర్తృక శక్తులతోకూడా అట్టి సంబంధము నేర్పరచుకొనఁజూతురు.

భూతప్రేత పిశాచ గణములకు సంబంధించిన రూపరహితమైన శక్తులమధ్య మానవుడు జీవించుచున్నాడని, మానవుని జీవితమునం దొక్కొక విషయము నొక్కొక శక్తి యావహించి యుండునని వారి నమ్మకము. కలరా, మశూచి జాడ్యములకు సంబంధించిన శక్తి, కొండ లలో పర్వతములపైన గల శక్తి, నదులను నదీపాతములను చెట్లను ఆవహించిన శక్తి మొదలైనవి యున్నవని వారు విశ్వసింతురు.

మీర్జాపూరులోని కొర్వలు పంటలను పర్వములను ఆవహించి యున్న శక్తి కలదని నమ్ముదురు. కేవలము దుష్టశక్తులను మాత్రమే ఆదిమ జాతులవారు ఆరాధింతురనుకొనుట పొరబాటు. వారు రాళ్ళను రప్పలను, ఈకలను, మొక్కలను చెట్లను, పుట్టలను ప్రకృతి దృశ్య ములను సూర్యచంద్రులను నక్షత్రములను కూడా ఆరాధింతురు. వారు ఆది భౌతిక ప్రపంచముయొక్క తత్వము నెఱుగగోరుదురు. తమ భవి ష్యత్తుకు కారణభూతమైన శక్తులనుగూర్చి తెలిసికొనుటకు ప్రయత్నిం తురు. అవి మంచి శక్తులని, దుష్టశక్తులని వేరువేరుగా నూహించి ఆ ప్రకారము వానిని తృప్తిపరచి పూజింతురు. "సింగ్‌బొంగ" అను సూర్యదేవుడు పరమదయాళువనియు ఎవ్వరికి అపకారము చేయడనియు

ముందాజాతివారి విశ్వాసము. అందువలన దుష్టశక్తులను ఆరాధించినట్లు ఆదేవుని ఆరాధింపనవసరము లేదని ఎంచుదురు.

ఆదిమవాసుల జాతులవారందరు నొక సృష్టికర్తయున్నా డనియు మానవునికి కావలసినదెల్ల ఆదేవుడొసగుననియు ధృఢముగా నమ్ముదురు. ఆ మహాదేవుడు ప్రజోపకారియని భూమిపైన, నీటిపైన గాలిలోను చరించుచుండు ఇతర దుష్టశక్తులవలె చీటికి మాటికి ఆగ్రహించి యప కారము చేయడనియు అందువలన వారిని తృప్తిపరుప జూచినట్లే ఆయన నారాధింప నవసరము లేదనియు వాని యూహ.

ఎన్నితప్పులు చేసినను ఆదరించు తల్లివలె ఈ మహాదేవుడు కాపాడునను నమ్మకము. ఆదిమవాసుల మతమును పవిత్ర మొనరించు చున్నది. ఇట్టి యాటవికజనులమతవిశ్వాసములు భారతదేశములోని "హిందువుల" సనాతన ధర్మమునకు వైదిక మతమునకు చాలా సన్ని హిత సంబంధమును కలిగియున్నది. హిందువుల పురాణములందు పేర్కొనబడి, వారు పూజించు దైవములతోపాటు ఈ యాదిమవాసులు మఱికొన్ని దైవములను ఆరాధించి తమ యిష్టసిద్ధిని పొందుటకు ప్రయ త్నించు చున్నందువలన భారతీయులీ ఆదిమవాసుల మతమును హర్షించి గౌరవింతురు. తమ ముక్కోటి దేవతలలోనీ యాటవికజనుల దైవము లను గూడా చేర్చికొని ఆరాధించుట కెట్టి యభ్యంతరము చూపరు. అందువలన నీ యాదిమవాసుల మతము సనాతన ధర్మమునకును మంత్రతంత్రముల మతమునకును మధ్య నొకవిధమైన ఆధ్యాత్మిక వార దిగా నున్నది.

ఆదిమవాసులలో కిరస్తానీ మతమును వ్యాపింప జేయుటకు పాశ్చాత్యులెన్నో మాయోపాయములనుచేసి కొంత కృతార్థతగాంచిరి. ఇంగ్లీషు ప్రభుత్వమువారీ ఆదివాసులను ఇతర హిందువుల నుండి వేరుజేయుట కనేక ప్రయత్నములు చేసిరి.

మధ్యరాష్ట్రములలోని గోండుజాతివారు ఇతర హిందువులవలెనే తమ దైవములకు దేవాలయములు నిర్మించి ఆరాధనలు అర్చనలు జరుపు

దురు. బలిలోనగి కొలుపులు జాతరలు చేయుదురు. వారికిని అర్చకులు
పూజారులు నున్నారు. వారికిని తీర్థయాత్రలున్నవి. వారిమతచారముల
కును హిందువులలోని తక్కువ కులములవారి మతాచార వ్యవహారము
లకును భేదము కనబడుటలేదు. ఈ తక్కువ కులములవారు తమ
చుట్టుప్రక్కల జీవించు గోండుజాతివారి దైవములను కొలుచుటయు పరి
పాటియైనది. భారతదేశములోని ఆదిమవాసుల జాతులవారి మతధర్మము
లందు ఇతర హిందువుల ఆచారకాండ వ్యాపించి దానిని సనాతన ధర్మ
మునకు సన్నిహిత మొనరించినది *

ఆదివాసుల గుణశీలములను గూర్చియు వారి నీతి నియమము
లను గూర్చియు నాగరిక ప్రపంచమునకు తెలియుటకు అవకాశములు
చాలా తక్కువగా నున్నందున వారినిగూర్చిన యపోహలు ప్రబలి
నవి. ఆదివాసులు సత్యసంధులు. నీతిపరులు; అమాయకులు; సాహ
సౌర్యాది సద్గుణములు కలవారు. స్నేహపాత్రులు. వారినేమి చేయ
మన్నను చేయుదురుకాని అబద్ధమునుమాత్రమాడరు. "నర్మదా
నదీతీర ప్రాంతములందొక మహారాష్ట్ర పండితుడు నాతో మాట్లా
డుచు లౌకిక జీవనమునందొకప్పుడు బొంకుట యవసరమువి
దాని లాభమునెంత చెప్పినను అడవులలోను కొండలపైనను
వసించు గోండుల కబద్ధము నాడుట నేర్పుట సాధ్యము కాదని చెప్పి
నారు. అయోధ్య "టెర్రేస్" అడవులలో వ్యవసాయము చేయు
థారూలను బూక్సాలను. హిమాలయ పర్వతములందు వసించు కొండ
జాతులను. నాగరిక జనులతో సంపర్కము కలిగి. ఇంగ్లీషు న్యాయ
స్థానములందు వివాదములలోనికి దిగకపూర్వము నాలుకలు కోసినను
అబద్ధమాడువారు కారని, "అయోధ్య రాజ్యమునందు పర్యటనము"
అను గ్రంథమునందు భారతదేశమున చాలాకాలము గొప్ప యుద్యో
గము చేసి దగ్గుల నిర్మూలనమునకు కృషిచేసిన స్లీమన్‌గారు వ్రాసినారు.

* Races and Culures of India; D. N. Mazumdar (Kitabistan) pp 216 - 225.

అటవికజనము హోటువారే. వారి ఆచార వ్యవహారములు నాగరక ప్రపంచమునకు వింతగా నుండునను సంగతి నిజమే కావి వారిని కూడా కొన్ని మతధర్మములు, నీతి నియమములు సంస్కృతి సంప్రదాయములు ఉన్నవి. సామాన్య పాశ్చాత్య గ్రంథకర్తలు వ్రాసినట్లు వారు కేవలము వన్యమృగములవంటి వారును దుర్మార్గులును కారు. వారితో కలిసి మెలసి జీవించిన పాశ్చాత్య మతబోధకులలో సద్ధర్మలగువారు కొందరు వారియొక్క మంచి గుణములను గూర్చియు, సంస్కృతి సంప్రదాయములను గూర్చి వ్రాసియున్నారు.

ఫాదర్ వెరియర్ ఎల్విన్ అను నొక ఆంగ్లేయ మిషనరీ గోండులతో కలిసి జీవించుచు ఒక గోండు కన్యను వివాహమాడి వారి ఆచార వ్యవహారములను గూర్చి సంస్కృతి సంప్రదాయములను గూర్చి ఒక గొప్ప గ్రంథమును రచించినాడు.

## క బా ది వి ధా న ము

ఆదివాసులు సత్యసంధత, నీతినియమములు ఋజువర్తనమును నిరుపమానములు. నాగరకత వ్యాపించిన కొలది యీ సద్గుణములు తగ్గుముఖము పట్టుచుండును. దీనికి కారణము పరిసరగ్రామములందలి నాగరక జనులు వారిని మోసగించి అన్యాయములు చేయుచు లాభము లార్జించుచుండుటయే.

గోండు జాతికి చెందిన మరియా, మురియా, పర్జా, భత్రా, గదబ, కొఖల ఆదివాసులు బస్తరు సంస్థానములో నున్నారు. ఈ ఆదివాసులలో నెవ్వరైనను ఎవ్వరికైన ఋణపడినచో వాడు తన యావజ్జీవము ఋణదాత క్రింద యూడిగము చేసియైన యా బాకీని తీర్చుకొనును.

---

**Sleaman:**

**A Journey through the Kingdom of Ourdh 1849-50**
**Rise and fulfilment of British Rule p 334-5**
**Thomson Garratt p 407-8**

ఒకవేళ సీలోపుగా వాడు చనిపోవుట తటస్థించినచో వాని కుమారు డాతని ఋణమును తీర్చుటకై ఆ యజమాని కుటుంబమున కతడు కబాది(Kabadi)లేక శాశ్వత భృత్యుడుగా సేవచేయును-ఈయమాయక జనులింత నీతిపరులైనందువలన తెలివితేటలుగల ఋణదాతలు వారిని శాశ్వత దాస్యమున నుంచుచుందురు. తన తండ్రి ఋణమును దీర్చవచ్చిన కబాది పెండ్లికి సొమ్ము అవసరమగుట కని పెట్టి ఋణదాత మఱికొంతసొమ్ము బదులిచ్చును. ఆ ఋణము వడ్డీతో పెరుగుచునే యుండును. అందువలన నాకబాదియు వాని సంతతివారును యజమానుని కుటుంబమువారికి శాశ్వతముగా బానిస లగుదురు. ఇట్లు నీతికి కట్టుబడివచ్చిన కబాది పుచ్చుకున్న ఋణముపైన యజమాని యెంత హెచ్చువడ్డీ వేసికట్టినను. ఎన్ని విషమ షరతులు పెట్టినను ఆ కబాదికి కడుపునిండ తిండి పెట్టకపోయినను ఇంకా యెన్ని బాధలు పెట్టినసుకూడా వాడు నోరు మెదల్పక తనకర్మమని యీ బాధలనెల్ల సహించును. ఈ కబాది తన ఋణము తీర్చనంతకాలము వాడును వాని కుటుంబమును ఆకలిబాధవలన చచ్చిపోకుండా ఏదోకొంతగ్రాసము నివ్వవలయునను నియమమొకటియున్నది. అయితే ఇది బస్తరు సంస్థానములోనన్ని తహశీలులలో నొకేవిధముగా నివ్వరు.వేరువేరుచోట్ల వేరు వేరు విధములైన రేట్లు ప్రాప్తి నొసగుదురు.

బస్తరు సంస్థానములోని వ్యవసాయదారుల కవసరమైన పాలేర్లకు నౌకరులకు నిచ్చు కూలి జీతబత్తెములు నా సంస్థానములో చిరకాలాచారమును బట్టి యేర్పడియున్నది. కొండగోవను బిజాపూరు తహసీళ్ళలోని పాలేళ్ళు కొందరు ముందుగానే వ్యవసాయదారుల దగ్గర కొద్ది మొత్తములను పుచ్చుకొని ఆ సంవత్సరములో వ్యవసాయ పనులనెల్ల నిర్వర్తించుట కంగీకరించుదురు. సాధారణముగా నొక పాలేరు

---

Races and Cultures of India D. N. Mazumdar (Kitabistan) p 92

సాలుకు నాలుగు రూపాయల రొక్కము ఒక పయిలా (Paila) ధాన్య మును లేదా దినమున కొక సోలి (Soli) బియ్యముఉప్పు, మిరప కాయలు, పొగాకును పండుగ రోజులలో త్రాగుటకు రెండణాలును శ్రీకాకుళములో రు 1-8-0 విలువగల ఒక జత దుప్పట్లును ఇచ్చు పద్ధతిని నౌకరీ చేయుదురు. కొంటా తహసీలులో "జ్వారి" (Jwari) పంట పండును. అక్కడ ఈ పద్ధతిప్రకారము పాలేళ్ళను నియమించు ఆధారములేదు. అక్కడ భూములున్న వారికి భూములు లేనివరు వ్యవ సాయపు పనులలో సహాయము చేయుదురు. పంటసమయమున వారి కేదో కొంత ప్రతిఫల మిచ్చెదరు.

దరిద్రుడైన ఒక బంధుగుని గాని కొంతమంది బంధుగులను గాని ఒక సంపన్నుడు తన యింట శాశ్వతముగా నుంచుకొని పోషిం చుచు, ప్రత్యేకముగా నౌకరీ యేర్పాటుగాని ప్రతిఫలము నిచ్చు ఏర్పాటు గాని లేకుండా వారికుటుంబమునకు వ్యవసాయపనులలో తోడ్పడు "పెట్నేన" పద్ధతి యొకటి, అనుశృతముగా జరుగుచున్నది.

నాగరకులు చొరని అరణ్యముల లోపలి భాగములందు ఆటవిక జనులు గుంపులుగా నివసించుచోటులలో "కబాది" పద్ధతి కనబడుటలేదు. కొంత నాగరిక పరిస్థితు లేర్పడిన ప్రాంతములందే యది కానవచ్చు చున్నది. కబాడి సేవకులకిచ్చు ప్రతిఫలము వివిధ తహసీలులలో వేరువేరు విధముగానున్నది. అయితే సాధారణముగా సాలుకు 12 ఖండీల Khandis ధాన్యము అక్కడ పంటమార్పిడి సమయమున ఆరు ఖండీల "దంవిముంవి" యు పంటకోతలు పూర్తియైన పిమ్మట ఆరు ఖండీల కటోర్ (Kator) ధాన్యమును, సాలుకు రెండు రూపాయల రొక్కమును బట్టలు రు 1-8-0; ఉప్పు మొదలైనవి 0-8-0 అప్పు డప్పుడు పెట్టు అన్నమును కలిపి రెండవ ప్రపంచ సంగ్రామమునకు

పూర్వపు ధరల ప్రకారము నెలకు రెండురూపాయలగును. అయితే అన్ని వ్యవహారములను యజమానియొక్క దివ్యచిత్తానుసారముగా జరుగు పద్ధతిలో అతడు వీలైనంతవఱకు ఏ దురదృష్ట కబాదికి రావల సినదానిని తగ్గించి లాభము పొందుచుండును. కబాది నౌకరులు తమ యజమానుని యింటి ఆవరణలోనే నివసించుచు పిలిచినవుడు పలుక వలెను.

కబాది విధానములోని అన్యాయములు మితిమీరగా దానిని ప్రభు త్వమువారు నిషేధించిరి కాని అంతమాత్రమున నది యంతమొందలేదు. దరిద్రులు అమాయకులునగు ఆటవిక జనుల బాధలు మానలేదు.

# 4. రాజకీయ సంబంధములు

అడవి, చెంచు, కోయ, భిల్లులు మొదలైనవారు నామకార్థముగా తమ పరిసర రాజ్యముల ప్రభువులకు లోబడినవారైనను వారించు మించుగా స్వతంత్రులుగానే యుండిరి.

"ఆజ్ఞవలయు నృపతి కాభీరభిల్లాది కంపకోలనూల నాజ్ఞ చెల్లు
వంట; సౌర్వభౌముడైన భూపతి యాజ్ఞ నెల్లవారు దల్లడిల్ల వలదె"*

అని కృష్ణదేవరాయలవారు తమ అముక్తమాల్యదలో వ్రాసినారు. అడవి గొల్లలు, కోయలు భిల్లులు మొదలైన పాలెగాండ్రకు అడవిలో ఆజ్ఞ చెల్లును. ఎట్లనగా వారు, ఎవరికైన అభయ మిచ్చినచో వానిచేతి కొక యంపకట్టెనుగాని నూలిపోగును కాని గుర్తుగా నిత్తురు. దానివిగవి వారి ప్రజలైనచో దొంగలు వారిని చెనకరు అని ప్రసిద్ధి. అట్టివారికే ఆ విధముగా ఆజ్ఞ చెల్లునేని సర్వభూమినేలు దొరయాజ్ఞకు జనులందరును తల్లడిల్లవలదాయని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలవారు అర్థము వ్రాసిరి.

"ధరణి నసాధ్య నగాటవు లిరవుగ భూపీడసేయు నెఱుకుల పొరుగూ
ళ్లెరవగుస స్థితి భూరుల కెరవుగా నిచ్చునది మిథము నెల్లయిన
నురున్"

చొచ్చి సాధింప శక్యముగా పర్వతారణ్యములందు నివసించుచు రాష్ట్రపీడచేయు నెఱుకులు మొదలైన కిరాతుల నివాసముల పొరుగు గ్రామములను స్థితిలేని పరాయి భూరులకు తాత్కాలిక జీవనార్థముగా నిమ్ము. ఆ యెఱుకులు నీ భూరులు పరస్పరము పోరాడి ఏమయినను మంచిదే।

---

* అముక్త మాల్యద ౪ వ ఆశ్వాసము ౨౦౬ (౨౨౧)

విశేషించియు నపూర్వకీయ బలంబులోనం గూడక
యు రాజునకుఁ బ్రజాబాధ దఱుఁగ దెల్లని. -
బెదరు వాపి వారలం జేకూర్చుకొనవలయు; నవిశ్వా
వంబును విశ్వావంబును కలుకయు నెలమియు,
నతి వైరంబును నత్యానుకూల్యంబును నల్పు
లగుదినల్పంబున నయగు" (౨౨౨)

ఆపాలకూటనే నిజమే పాటియుఁ దప్పరాపిరే నెరసునఁ గొం
తేపాటి గన్ననలుగుదు రీపని యెంచినక వెతఁగు
పెద నాటవికుల్" ౨౨౪

"బోయలు చెంచులు లోనగు నాటవికులు పాలన్నము
పెట్టినమాత్రాననే ఆ పెట్టినవారియెడ సత్యము
తప్పక ప్రవర్తింతురు. అయినను ఏ యించుక
అతిక్రమము కనబడినను వెఱ్ఱిబుద్ధిచే - ఇది
యొక్క తప్పాయని దాని నుపేక్షింపక పగబట్టుదురు

వారికి స్వల్పముననే స్నేహద్వేషములు కలుగును. అని శ్రీ కృష్ణదేవ రాయలవారు అనుభవ పూర్వకముగా నెఱిగిన సంగతులను ఆముక్త మాల్యదలో వివరించిరి.

విజయనగర చక్రవర్తులు రాజ్యము నేలుచుండగా వారి సైన్యములు శత్రురాజ్యముయొక్క పరిహద్దులను సమీపించగానే సామ్రాజ్యములోని అడవులందు కొండలందు వసించు ఆటవిక జాతులవారు చక్రవర్తియాజ్ఞానుసారముగా శత్రురాజ్యములోని గ్రామములపైన బడి కొల్లకొట్టుచుండురు. శత్రురాజులపైన దండయాత్రలు చేయుటలో దోపిడుచేసి స్త్రీ పురుషుల నెత్తికొనిపోయి అల్లరులు జరుగకుండా నుండుట యుక్తమని తిరుమలాచార్యులవారు చెప్పియున్నారు; అయినను ఈ విషయమునందు ప్రభుత్వమువారు కొన్ని ప్రత్యేకపు ఏర్పాటులు గావించుచుండిరి.

గ్రామములను తగులబెట్టుట ఆ కాలములో చాలా తరుచుగా జరుగు చుండెను. *

"కృష్ణదేవరాయలువారు తురకాణ్యముమీద దళమెత్తినప్పుడు బోయిదొరల నందరినిన్ని రప్పించి పదునెనిమిది కప్పడాలవారినిన్ని నగరనింద బెట్టించి హరిబాణం కొమాళ్ళతోను కార్యముకానకు తురకాణ్యం సీమలోనుమునకలుగాబోయి దిగి మూడేశి యామడలదూరం సారి నరాళంబోయి. మనుష్యుల. పసలం ప్రాయలు. గొత్తెలు. మేకల గుఱ్ఱాల పుండకుండా కొల్లబెట్టమనిన్ని యెదిరితోడట్టు నకల సన్నాహములతో దట్టు బయలుమెరశి వెలిగుదారమునకు వచ్చి నిలిచి" రాయలవారుత్తరువులు చేసిరని రాయవాచకములో వ్రాయబడినది. (చూడు. రాయవాచకము పుట 83)

మన సారస్వతమునందు వేటముచ్చట వచ్చినప్పుడెల్ల. అటవికులు రాజు వద్దకు వచ్చి పునుగు పిల్లులను దుప్పికొమ్ములను ఏనుగు దంతములను పులిగోరులను జింకచర్మములను చారపప్పు. ముంతమామిడి, తేనె, మొదలగువానిని దెచ్చి కానుకగా నిచ్చినట్లు వర్ణింతురు. "ఒక యెఱుకుఱేఁడు నక్కకొమ్ము నిత్తి గోరోజనంబు జున్నుఁ జారపప్పుఁ బిలిగఱుల యంపకోలలు నెలవిండ్లఁ గానుకిచ్చి కరయుగంబుమొగిచి"నట్లు పెద్దన్నగారు మనుచరిత్రలో వ్రాసిరి. (చూ.అశ్వా.౪)

పూర్వము హిందూ మహమ్మదీయ పాలకులకు లోబడినట్లు అటవిక జాతులవా రింగ్లీషు ప్రభుత్వమునకు లోబడలేదు సరికదా వారు వీలైనప్పుడెల్ల తిరుగుబాటు చేయసాగిరి. దీని కాంగ్లేయు లితర కారణములను చెప్పజూచినను నిజమైన కారణము ఆంగ్లేయు లీ యాటవికులనుండి అడవులను ఆటవిక సంపదను లాగికొని లాభము పొందుటకై అనేక కఠినశాసన విధులను నిర్బంధ చర్యలను ప్రయోగించి వారిని బాధించు చుండుటయే. తుదకాయడవుల నింగ్లీషుప్రభుత్వమువారు తమ స్వంత

---

* The Third Dynasty of Vijayanagara Dr. N. Venkata Ramanayya pp 137-8

అస్తిగా చేసికొని అటవికులకు లేకుండా చేసిరి. అటవిక జాతుల నొకరినుండి యొకరిని వేరుచేసిరి. నాగరిక జనులనుండియు వేరుచేసిరి. నిరంకుశ పరిపాలనమునకును సైనిక శాసనములు వంటి కఠిన విధానము లకును లోనుచేసిరి అందువలననే మనదేశములోని అన్ని ప్రాంతముల లోనుగల అటవికజాతులవారు ఇంగ్లీషువారికి విరోధులై తిరుగబడ సాగిరి. ఆంగ్లయుగమునందు మొదటినుండి తుదివరకు విప్లే జరుగుచుం డెను. 1857 కు పూర్వమును తరువాతను కూడా ఈ స్వతంత్ర - పోరా టము జరుగుచునే యుండెను.

భారతదేశ రాజ్యాంగ విధానమునందు ఇంగ్లీషువారు ఏవో కొన్ని చిన్న సంస్కరణములను గావించినను ఈ యాటవిక జనము వసించు అరణ్యప్రాంతములందును వాని నానుకొనియున్న మన్యప్రాంతములం దును ఎట్టి రాజకీయసంస్కరణములను గావింపక నిరంకుశ ప్రభుత్వ విధానములనే అమలు జరిపిరి. పైగా ఇంగ్లీషువారితర ప్రాంతముల కొరకై చేసిన రాజ్యాంగ చట్టములందీ ప్రాంతములను మినహాయింపు చేయుచుండిరి. 1935 వ సంవత్సరపు రాజ్యాంగముల యొక్క 91 - 92 సెక్షనులు పరిచ్ఛేదములను బట్టి ఈ ప్రాంతములట్లు మినహాయింపు చేయబడి గవర్నరు జనరలు గవర్నరులయొక్క ప్రత్యేకాధికారముల క్రింద నుంచబడెను.

ఆంగ్లేయ ప్రభువులు తామీ యాటవిక జనుల యొక్క క్షేమ లాభముల నాలోచించియే అక్కడ నిరంకుశ ప్రభుత్వ విధానమును స్థాపించినామని చెప్పుచుండిరి. నాగరక ప్రజలబారినుండి వారిని రక్షించుటకు కొన్ని శాసనవిధులను చేసితిమనిరి. అయితే నిజమునకు ఆ ప్రాంతములను తమ నిరంకుశ పరిపాలనము క్రింద నుంచుకొని లాభమును పొందుటకే అట్లు చేసిరని అందరెరుగుదురు.

భారతదేశ చరిత్రలో హిందూ మహమ్మదీయ యుగములందు దేశములో తక్కిన ప్రాంతములందలి నాగరక జనులతో స్నేహము గలిగియుండి ఈ దేశపు రాజులకు చక్రవర్తులకు తోడ్పడుచుండిన

అటవిక జాతులవా రింగ్లీషుప్రభుత్వ యుగమునందు ఇంగ్లీషువారి చర్యల వలననే వారికి విరోధులై తరచుగా తిరుగుబాటు చేయసాగిరి. అరణ్యములకును నాగరక రాజ్యములకును మధ్యమందు మన్యప్రాంతములలోని జనులును, వారి నేలు కొండజమిందారులను ఇంగ్లీషువారికి లోబడి వారి కుట్రతో, ఈ అటవిక జనులను పీడించి అటవీసంపదను అపహరించుచు అటవికుల స్వాతంత్ర్యమును హరించి వారికనేక నిర్బంధములు కలిగించి బాధించుచుండుట వలన అటవిక జాతులవారిట్లు తమకు అన్యాయము చేయువారి గ్రామములపైన బడి కొల్లగొనసాగిరి. అటవిక జాతుల కదివరకుండిన స్వేచ్ఛ, స్వాతంత్ర్యము, జీవనాధారములు, వృత్తి వ్యాపారములు, పోయినందున వారు దోపిళ్ళు చేయసాగిరి. అంతట ఇంగ్లీషువారు తమ సైన్యమునంపి అటవికజనులపైన తుపాకులు కాల్చుచు తిరుగుబాటుల నణచుచుండిరి.

భారతదేశమున నింగ్లీషువారు వర్తకము చేయుట ప్రారంభించి రాజ్యాక్రమణచేసి బలవంతులై అడవుల నాక్రమించిరి. అందలి సంపదనెల్ల చేజిక్కించుకొనిరి. అందుకొరకెన్నో అన్యాయములుచేసిరి. దౌర్జన్యములు గావించిరి. కఠినశాసన విధులను చేసిరి. నిరంకుశ పరిపాలనమును స్థాపించిరి. ఇదియంతయు అటవికజాతుల క్షేమము కొరకే తాము చేయుచున్నామని ప్రకటించిరి. అందువలన ఆంధ్రదేశపు మన్యములందు కొండజమిందారీలందు అరణ్యప్రాంతములందు కోయలు, ఖోండులు, సవరలు మొదలైనవారేకాక మధ్య భారతదేశములోని గోండులు వింధ్యారణ్యములలోనుండి సంయుక్తరాష్ట్రపు సరిహద్దులు బీహారు వరకు వ్యాపించిన కోలులు, బంగాళా, ఒరిస్సా రాష్ట్రములందలి సంతాలులు, అస్సాము అడవులలోని నాగులు మొదలగు అటవిక జాతులవారును, బొంబాయి ఖాందేషులలోని భిల్లులు నింగ్లీషువారిపైన తిరుగుబాటుగావించి చాలా మారులు యుద్ధములు చేసిరి. వీరినణచుటకై ఇంగ్లీషువారు నిరంతరముగా సైనికబలములను ఉపయోగింపవలసి వచ్చెను. ఈ తిరుగుబాటులనింగ్లీషువారు మన్యపు పితూరీలని చెప్పు

చుండురు. క్రీ. శ. 1785 నుండి 1862 వరకును యుద్ధములు సాగుచునే యుండెను.

ఇంగ్లీషువారి దేశములో వర్తకము చేసి కొనుటకువచ్చిమొగలాయి చక్రవర్తిని రాజులను, నవాబులను ఆశ్రయించి ఎగుమతి దిగుమతి వ్యాపారములను చేసికొనుటకు అనుజ్ఞనుపొంది త్వరలోనే దేశములో నుత్పత్తియగు అన్ని ముడిపస్తువులలోను తయారగు అన్ని పారిశ్రామికవస్తువులలోను సర్వసత్తాగావ్యాపారము చేయుచు దేశీయ పారిశ్రామికులతో పోటీచేసి వారి జీవనాధారములను పడగొట్టిరి. 1611 నుంచి 1813 వరకు నిట్లు జరిగినది.

కుంపిణీవారు 1765 నుండి రాజ్యాక్రమణము చేయుట ప్రారంభించి రాజ్యాధికారములను వహించుటవలన దేశమునకు ప్రభువులై యున్నందున సర్వసత్తావ్యాపారము చేయుట బాగాలేదని ఇంగ్లీషు పార్లమెంటువారా యధికారములను 1813 లో తీసివేసిరి గాని వారి ఫ్యాక్టరీలను రద్దుచేయలేదు. అందువలన అధికారబలము వలన నింగ్లీషు కుంపిణీ వారనేక విలువగల వస్తువులయందటి వ్యాపారమును చేయుచుండిరి. ఇంగ్లీషుకుంపిణీ ప్రభుత్వమువారు బలవంతులై భారతదేశమున రాజాధిరాజులుగాను ఉన్నందువలన నిక నిక్కడ వ్యాపారము చేయుటయే అసమంజసమని పార్లమెంటువారు 1833 లో శాసించిరి. అయినను వారు చీనాకును బర్మాకును ఎగుమతి వ్యాపారము చేయుట మానలేదు. వ్యాపార లాభములను పొందుటకు ఇంగ్లీషు కుంపిణీవారెన్నో అక్రమములను అన్యాయములను చేయుచుండిరి. వారు రాజ్యాధిపత్యము వహించిన తరువాత నీదేశమునుండి వీలైనంత సొమ్మును చేజిక్కించుకొనుట కెన్నో అన్యాయములు చేయసాగిరి. ఈ పరిస్థితులలో భారతదేశపుటడవులలో దొరకు అమూల్యములైన వస్తుజాలమును ఏదోవిధముగా తెప్పించి వ్యాపారము చేయుటకై కుంపిణీవారు మొదటినుండియు ప్రయత్నించుచుండిరి. అందుకొఱకు వీరు నాగరక ప్రాంతములకును చొరని అడవులకును మధ్య సరిహద్దున గల అనారోగ్యకరములైన మన్యపు కొండలవంటియున్న చిట్టడవి ప్రాంతములందలి కొండ జమిందారులతోను

వలుకుబడిగల పాలెగాండ్రతోను స్నేహము చేసి తాము కొంతమంది దేశీయ దళారీవర్తకులకు ధనమిచ్చి ఆటవిక సంపదను తరలించుటకు తగు ఏర్పాటులు గావించిరి.

కుంపినీవారు రాజ్యాధికారములను సంపాదించిన పిమ్మట కొండ జమీందారులు పరిహద్దుల సంరక్షణము చేయుచు అటవీ సంపద తరలింపుచేయు పద్ధతిపైన వారికి చౌకబారు పేష్కషు నిర్ణయించిరి. అయితే ఆ స్వల్పపు సొమ్ము కిస్తీలు కూడా వారు చెల్లించనందున కుంపినీవారు వారిని తొలగించుచు ఆ జమీందారీల కుటుంబములోని వారి కెవరికో కట్టబెట్టుచు మిత్రభేదములు చేయుచు కుటుంబ కలహము లందు ప్రవేశించి వీరి నొకరి తరువాత నొకరిని తక్కు దింపి యెక్కిం చుచు కుటిలరాజ్య తంత్రమును ప్రయోగించి తమ పనులు చక్కబెట్టుకొన చూచిరి. ఒక్కొక్కప్పుడు పాత జమీందారుదే పాతబాకీని చెల్లించుట కంగీకరించినప్పు డాతని భూస్థితి నతనికి పప్పగించుచుండిరి.

ఈ కొండ జమీందారులలో కొందరు పూర్వీక రాజుల క్రింద పరిహద్దు ఆటవిక జనము విలని శిస్తులు వసూలు చేయు మన్సబు దారులుగా నుండిరి. కుంపినీవారి కొలకై ఈ జమీందారులు వీరి మనుష్యులు చేయు అక్రమములను దుర్మార్గములనుసహింపక అటవికులొక్కొకప్పుడు పరిసర గ్రామముల పైనబడి కొల్లకొట్టుచుండిరి. ఇట్లుసరిహద్దు మన్యము లలో తరుచుగా కల్లోలములు జరుగుచు తిరుగుబాటులు జరుగుచుండెను. పరిహద్దు కొండ జమీందారులు కుంపినీవారిపైన తిరుగుబాటుచేసి ఆటవిక జనముండు దేశములో తలదాచుకొను చుండిరి. అందువలన మన్యము లందు చాలా విధములైన పితూరీలు చెలరేగు చుండెను. మధ్యమధ్య ఆటవిక జాతులు కూడా తిరుగబడి తీవ్రముగా పోరాడుచుండిరి.

ఈ మన్యప్రాంతములు అనారోగ్యకరములై కొండలలోను అరణ్యములలోను ఉన్నందున కుంపినీ యుద్యోగులిక్కడ శాంతి భద్రతలనుగాని స్థిర పరిపాలనమునుగాని స్థాపింప లేకుండిరి. రక్షకభటులను తగిన సిబ్బందిని యుంచలేకుండిరి. అందువలన నీప్రాంతపు మోటు

జనులకి కుంపినీవారి సైనికబలము సంగతి తెలియుటకు అవకాశములేక నిరంతరము అధికార ధిక్కారము చేయుచుండిరి. అప్పుడప్పుడు అక్కడ పితూరీల నణచుటకు పోయిన కుంపినీ సైనిక దళములను సిబ్బందియు జబ్బుపడి హెచ్చుకాల ముండలేక కొన్ని యుద్ధములందోడిపోవుచు కొంతజనము నష్టపడుచుండిరి.

వీలైనప్పుడు మాత్రము కుంపినీవారు తమ యధికారములను చెలాయించుటకు ప్రయత్నించుచు పరిసర జిల్లాలలోని శాసన విధులను ప్రభుత్వ పద్ధతులను అమలు జరుపజూచిరి. ఈమన్య ప్రాంతజనుల కీపద్ధతులు అర్థము కానందున వారు వీనికి లోబడక నిరంతరముగా వాని నుల్లంఘించుచు ఈ యుద్యోగుల లంచగొండితనమును వారుచేయు ప్రజా పీడనమును చూచి అసహ్యించుకొని తమకు జరిగిన అన్యాయములను గూర్చి పైవారికి చెప్పుకొను పద్ధతి నవలంబింపక పగతీర్చుకొనుటకుగాను దౌర్జన్యము చేయసాగిరి. ఒక్కొక్కప్పు డీ ప్రాంతములం దింగ్లీషు అధికారులు వారి సిబ్బంది ప్రాణములను గోల్పోవుచుండిరి. కుంపినీవారు సైనికశాసన ప్రభుత్వమును (Martiallaw) అమలు చేయుచుండిరి.

గోదావరి విశాఖపట్టణము గంజాములోని మన్యములందేగాక బస్తరు ఒరిస్సాంలోను మధ్యరాష్ట్రమునందును బంగాళారాష్ట్రము లందునుకూడా ఇట్టిపరిస్థితులే సంభవించుచుండెను. 178[illegible]-1822 మధ్య గోదావరి మన్యమున చాలా పితూరీలు జరిగెను. 1831-32 మధ్య విశాఖపట్టణము గంజాము జిల్లాల మన్యములందు చాలా తీవ్రమైన తిరుగుబాటులు జరిగెను. మహారాష్ట్రమున భిల్లులు 1825లో తిరుగుబాటు చేసిరి. 1832 లో కోలజాతి వారొక గొప్ప పితూరీ చేసిరి. 1835 లో సంతాలులు తిరుగుబాటు గావించిరి. ఇట్లు దేశములోని ఆటవికజాతుల వారందరు ఇంగ్లీషు వారితో యుద్ధములు చేసిరి. అనుభవజ్ఞులగు ఇంగ్లీషు కంపెనీ దొరలీ పరిస్థితు నాలోచించి నాగరక జనులుండు జిల్లాలకును దుర్గమారణ్యములకును మధ్యగల సరిహద్దు మన్యములందు కుంపినీవారితరరాష్ట్రములందు పరిపాలించు

చున్నరీతిగా "రెగ్యులేషను" లనుశాసనవిధులద్వారా జరుగు ప్రభుత్వ
విధానమును అమలుజరుగుట సాధ్యముకాదనియు. ఇక్కడి మోటు
జనులు తిరుగుబాటు చేయకుండా అణచియుంచుటకును అవసరమైన
చర్యలను ఆలస్యములేకుండా జరుపుటకు వీలగునట్లు నిరంకుశమైన
సర్వాధికారములు గల ప్రత్యేకాధికారముల క్రిందనే యీ ప్రాంతముల
నంచి సైనికశాసన ప్రభుత్వము వంటి నిరంకుశప్రభుత్వమును స్థాపిం
చినగాని లాభము లేదనియు నిశ్చయించిరి. అంతట నీ ప్రాంతములం
దెల్ల అటువంటి ప్రభుత్వమునే స్థాపించిరి. సామాన్య రాష్ట్రములను
"రెగ్యులేషన్ ప్రావిన్సు"లను చున్నందున వీనిని "నాన్ రెగ్యులేషను
ప్రావిన్సు"లనిరి. ఇక్కడి పరిస్థితులనుబట్టి గవర్నరుయొక్క పెత్తనము
క్రింద కలెక్టరులాయనకు స్పెషల్ ఏజంటులుగా సర్వాధికారములు కలిగి
పరిపాలించునట్లు శాసించిరి. సామాన్యముగా కుంపినీవారితో ఒడంబడి
కను చేసికొనివచ్చు "కవనెంటెడ్ సర్వీసు" ఉద్యోగులనేగాక ఈ
మన్యప్రాంతములందెల్ల వ్యవహారములను చక్కబెట్టుటకు శక్తి సామ
ర్థ్యములుగల ఇతర దొరలనుకూడా ఉద్యోగులుగా నియమించుటకు
గవర్నరుల కధికారమిచ్చిరి.

ఈ ప్రభుత్వవిధానములోని యుద్యోగులు సర్వాధికారములు కలిగి
యుండి వారికి దయగలిగినప్పు డెన్ని యుపకారములనైననుచేయుటకును
ఆగ్రహము కలిగినప్పుడెంత అపకారమునైననుచేయుటకును అవకాశము
లుండెను. వారు అవసరమునుబట్టి కఠిన చర్యలను తీసికొని క్రూరశిక్ష
లనుకూడా విధించి శాంతి భద్రతలను స్థాపించి ఈ మోటు ప్రజలను
అదుపు ఆజ్ఞలలో నుంచుటయే ప్రధాన కర్తవ్యముగా నెంచి పరిపాలించ
వలెను. సాధారణముగా నీ యాటవిక జనుల ఆచార వ్యవహారములతో
జోక్యము కలిగించుకొనరు. ఆ ప్రాంతములందు అమలుజరుగు ప్రాత
పద్ధతులలో మార్పులు చేయరు. ఏదైనా మార్పుచేయుట అవసరమై
నప్పుడు చాలా జాగ్రత్తగా చేయవలెనని కుంపినీవారు శాసించిరి.

ఆంగ్లేయ రాజ్యనీతిజ్ఞులు చరిత్రకారులును ఈ నిరంకుశ ప్ర
భుత్వ విధానము కేవలము ఆటవికజాతుల క్షేమలాభములకొఱకే స్థాపిం

చిత్తమనియు. రెగ్యులేషను ప్రావిన్సెస్ అనబడు నాగరిక ప్రజలునివసించు రాజధానులందు అమలు జరుగు శాసనవిధులును న్యాయపరిపాలనా విధానములును చాలా తికమకలుగా నున్నందున ఈ ఆటవికజనులు అర్థము చేసికొనజాలకున్నారనియు, అంతేగాక ఆటవికజనులు అమాయకులై యున్నందువలన పరిసర ప్రాంతములందున్న నాగరక ప్రజలు వీరిని మోసగించి వీరిపట్ల అన్యాయములుచేసి వీరిభూములు అక్రమించి సామాన్య పరిపాలనా విధానములోని గుంటచిక్కులనెఱిగిన వారైనందున ఆ ప్రభుత్వయంత్రము నుపయోగించి ఆటవికులను నష్టపరచుచు వారిని కోర్టులకీడ్చి అధోగతిలోనికి దింపుచున్నారనియు అందువలననే తాము సామాన్య న్యాయపరిపాలనా విధానమును తీసివేసి ప్రత్యేక నిబంధనలుగల న్యాయవిచారణ పద్ధతిని స్థాపించినామనియు చెప్పసాగిరి. అయితే వారి ఉద్దేశము వేరు. ఈ మధ్యప్రాంతములను ప్రత్యేకమండలములుగా చేసి ఈ ప్రజలను నాగరక ప్రజలనుండి వేరుచేసిరి. నాగరక మండలములలోని వారెవ్వరు నిక్కడికి వచ్చి భూములను సంపాదించుటకు వీలు లేకుండా నిషేధించిరి. అయితే పాశ్చాత్యులుగాని క్రైస్తవులుగాని ఈ మండలములోనికి స్వేచ్ఛగా వెళ్ళి లాభము పొందవచ్చును. మిషనరీలు క్రైస్తవమత బోధచేసి ఆటవికజనమును కిరస్తానీ మతమున గలుపవచ్చును. ఇక అడవుల విషయములోకూడా ఇంగ్లీషువారు చిత్రమైన పద్ధతి నవలంబించిరి. మొదట సరిహద్దు మన్యములపైన అధికారము వహించిన కలెక్టరులకే అడవుల పరిపాలనమును వప్పగించిరి. వారాంగ్లేయ కుంపినీవారి వ్యాపారమునకు వీలైనంత లాభమును కలిగించగల పద్ధతులను అమలుజరిపిరి. ఇంగ్లీషువారును వారిస్నేహితులు వేటాడుటకు, మృగములను వధించుటకు, ఆటవిక సంపదను తరలించుటకు వీలైన కట్టుబాటులను గావించిరి. 1807 లో ఇంగ్లీషువారికి రాజ్యాధికారము కలిగిన కొలది కాలములోనే మలబారులోని టేకుకలపను కొట్టి తీసికొని పోవువారిపైన "రాయల్టీ" పన్ను విధించిరి. అటుపిమ్మట ఈ పన్ను సముద్రతీరమునగల ప్రాంతములకన్నింటికిని వర్తింపచేసిరి. 1820 మద్రాసు గవర్నరుగా నుండిన సర్ థామస్‌మన్రో ఇది అన్యాయ

మది దీనివలన ప్రజలలో అసంతృప్తి వ్యాపించునని తన అనుమతిని తెలిపెను, అంతట కుంపినీవారప్పటికి దానిని అపుచేసిరి.

సరిహద్దు మన్యముల నానుకొనియున్న పెద్దఅడవులను క్రమక్రమముగా నింగ్లీషు కుంపినీవారు తమయధికారముక్రిందికి తెచ్చి దానిలాభమును పొందదలెనని నిశ్చయించి అందుకు వలసిన శాసనవిధులను కట్టుబాటులను క్రమక్రమముగా చేయసాగిరి. ఇంగ్లీషువారు మొదట షికారీవేటలవలన అడవులలోని క్రూరమృగములను వధించుచు అక్కడి దుర్గమారణ్యప్రాంతములను ఛేదించుటను ప్రోత్సహించుచు ఆటవికుల చేత ఆటవిక సంపదను తెప్పించి చేజిక్కించుకొనుటకు తగు కట్టుబాటులు చేసిరి. చాలా కాలమువరకు కలెక్టరులద్వారానే దీనికి సంబంధించిన ఉత్తరువులను అమలు జరిపిరి. సరిహద్దులలోని కొండవారికి అడవులలోనున్న ఆటవిక జాతులవారికి గల స్వాతంత్ర్యములను క్రమక్రమముగా తీసివేసిరి. ఆటవికజనము ఇంగ్లీషువారి తుపాకిదెబ్బల కాగలేక వెనుకకు పోయిరి. ఆటవికజనము నకదివరకు అరణ్యములలో నుండిన స్వాతంత్ర్యములును హక్కులను పోయినందువలన వారికి కొన్ని స్వల్పసౌకర్యములు కలిగించుటకు నిబంధనలు చేసినామని ఇంగ్లీషువారు లోకమునకు చాటితామెంతో దయార్ద్రహృదయులమనిరి. అడవులలో నదివరకువలె పోడువ్యవసాయము చేయుటకు వీలులేక వేటాడుటకు వీలులేక ఆటవికుల జీవనాధారము పోయెను. అయితే ఆంగ్లేయులు దయదలచి నయముననుభయముననుకొందరు దురదృష్టవంతులైన ఆటవికులను చేరదీసి వారిచేత అడవులలోని అమూల్య వస్తుజాలము నేరించి తెప్పించుచు చెట్లను నరికించుచు అందుకు వారికి రోజుకు మూడణాల కూలినిచ్చి తృప్తిపరుప జూచిరి. ఆటవికులు ఎంత యమాయకులైనను ఈ అన్యాయమునుచూచి లోలోపల బాధ పడకుండ నుండలేదు. వారు దేశములోపల గల దుర్గమారణ్యములకు పోవసాగిరి. వారి నింగ్లీషువారు మారుమూలలకు త్రోసి ఆ యడవులను ఆంగ్ల ప్రభుత్వమువారి స్వంతఆస్తిగా ప్రకటించిరి. కొన్ని ప్రాంతములను రిజర్వుడు ఫారెస్టులనిరి. కొన్ని ప్రాంతములను ప్రొటెక్టెడ్ సంరక్షిత

ప్రదేశములనిరి. తమకు పనికిమాలినదిగా తోచిన ప్రాంత ములను మాత్రము వర్గీకరించకుండా అప్పటికి వదలిరి. ఈ అడవులలో ఖనిజవృక్ష జంతుసంపదయెల్ల కంపెనీప్రభుత్వమువారి ఆస్తియైనది. ఈ అడవులలో ప్రజలు వేటాడరాదు. కట్టెలు కొట్టరాదు. అటవిక ద్రవ్యములు ప్రోవుచేసికొని పోవరాదు.

1847 లో ప్రత్యేకముగా నొక అటవిక ప్రభుత్వశాఖ స్థాపింప బడెను. అడవులకు సంబంధించిన అన్ని వ్యవహారములు ఆ శాఖద్వారా జరిగింపసాగిరి. డల్‌హవుసీ ప్రభువు గవర్నరు జనరలైన పిమ్మట నీ అడవుల పరిపాలనము క్రమబద్ధము చేసెను. 1855 లో బొంబాయి మద్రాసు బర్మాలకు అటవిక శాఖాధ్యక్షులను నియమించెను. అంతట అడవులన్నియు ఆంగ్లేయ ప్రభుత్వమువారివలన కట్టుదిట్టముగా పరిపాలింప బడసాగెను.

# 5. వెనుకబడిన ప్రాంతములు

బ్రిటిష్ ఇండియాలో "వెనుకబడిన ప్రాంతము"లు అనబడు అటవిక జనము కొండజాతులు మొదలైన ఆదివాసులు వసించు అరణ్య ప్రాంతములు 207900 చదరపు మైళ్ల వైశాల్యము కలిగి 130 లక్షల జనసంఖ్య కలిగియున్నదని భారతదేశ రాజ్యాంగమును గూర్చి సూచించుటకు నియమింపబడిన సైమను కమిటీవారు 1929లో వ్రాసిరి. • రాష్ట్రములవారీగా ఈవిషయమును గూర్చి వారు వివరించిరి. * మద్రాసు రాజదానిలో తూర్పు కనుమలకును ఒరిస్సా మధ్యరాష్ట్రపు సరిహద్దులకును మధ్యనున్న ఏజెన్సీ మన్య ప్రాంతములను గోదావరిజిల్లా కలెక్టరు మద్రాసు ప్రభుత్వ కార్యాలోచన సంఘమువారి సలహాతో గవర్నరుగారి ఏజెంటుగాపరిపాలించెను. ఈప్రాంతమందలి ఆదివాసుల అనాగరికస్వభావమునకు తగిన ప్రత్యేక శాసనవిధులుగల నిరంకుశ పరిపాలనా విధానమే అక్కడఅమలుజరుగుచుండెను. ఈప్రాంతము బ్రిటిషుపరిపాలనమునందు 1920 నాటికి కూడా అభివృద్ధి గాంచలేదు. ఈ అటవిక జనమునకుకొన్ని ప్రత్యేక మతాచారము లున్నవి. వారు అనవసరముగా తిరుగుబాటు చేయువారుకారు. అయితే వారికి ఆర్థికమైన బాధలు కలిగినను ప్రభుత్వాధికారుల వలన బాధలు కలిగినను సులభముగా ఉద్రేకముపొంది తిరుగ బడుదురు. కుంపినీవారి ప్రాంతములను పరిపాలింప బూనుకొన్నప్పటి నుండియు వీరప్పుడప్పుడు తిరుగుబాటులు చేయుచునే యుండిరి. అనిసైమను కమిటీ రిపోర్టులో వ్రాసిరి. పుటలు 56-57

వంగదేశమున ఉత్తరపుప్రక్క నేపాళము, సిక్కిము, రాజ్యములకు అనుకొనియున్న. దక్షిణ తూర్పు దిశలను అస్సాము బర్మాల వైపు

• Indian Statutory Commission Report Vol I. p. 158.

* Ibid p. p. 56–76 (1929)

వను చిటగాంగు కొండ ప్రాంతములున్నవి. ఇక్కడ కూడా ఇంగ్లీషువారు ప్రత్యేక నిరంకుశ ప్రభుత్వ విధానము నేర్పరచిరి. డార్జిలింగు జిల్లాలో వంగభాషను మాట్లాడు కొండజాతివా రున్నారు. మిగిలినవారు హిమాలయము లందున్నారు. వీరిలో వివిధ తెగలవారు వివిధములైనాచారములను భాషలను కలిగియున్నారు. చిటగాంగు కొండప్రదేశములందు అరణ్యమున్నది. అక్కడనీయాటవిక జనము పోడువ్యవసాయము చేయుచుందురు. అనగా చెట్లుతగలబెట్టికొని బూడిదలో గింజలు జల్లుదురు. వీరి జనసంఖ్య 170000 ఉన్నది. వీరు చాలా అనాగరకులుగా నున్నారు (పుట 62)

కాశ్మీరు సిమ్లా కొండరాజ్యములమధ్య లాహౌలుస్పిటి యనబడు హిమాలయ లోయలలో త్రివిష్టప జాతికిచెందిన అనాగరిక జనులున్నారు. (సైమను రిపోర్టు పుట. 67-68)

ఉత్తరమున బీహారు రాష్ట్రమునకును దక్షిణమున ఒరిస్సా రాష్ట్రమునకును మధ్య 'చోటా నాగపూరు'న్నది. దాని ముఖ్యపట్టణము రాంచి. ఇది సముద్రమునకు 3 వేల అడుగుల యెత్తుననున్నది. ఇందులో దట్టమైన అడవులు పీఠభూమి యున్నది. దీని జనసంఖ్యలో సగము మంది ఆదిమవాసులు అనాగరకులు. వీరనేక భాషలు మాటలాడుదురు. నూటికి ముప్పదిమంది చొప్పున హిందీ, ఒరియా భాషలు మాట్లాడుదురు. కొన్ని జిల్లాలలో ముండా భాషను ఇతర కోయభాషలను మాటలాడుదురు.

చోటా నాగపూరులో చాలా విలువయైన ఖనిజములున్నవి. హిందూదేశములోకెల్ల విలువగల బొగ్గు గనులున్నవి. అక్కడ కర్మాగారములలో మోటుపనులెల్ల ఈ అనాగరక జనమునకు చెందిన కూలీలు చేయుదురు. రాంచీదగ్గర తేయాకు తోటలున్నవి. అస్సాములోని తేయాకు తోటలకు కావలసిన కూలివారి నీ ఆదిమవాసులనుండి తీసికొని పోవుచుందురు. బీహారు ఒరిస్సాలలోని వివిధ ప్రాంతములందలి ఆదిమ వాసుల నాగరకతలోని భేదములను బట్టి అక్కడి పరిపాలనా విధానము లోను మార్పులుండెను. చోటా నాగపూరులోను, సంతాలు పరగణాలు శంబలపూరు జిల్లాలలోను, జీవించువారు అనాగరక ఆదిమవాసులైనందు వలన బ్రిటీషు వారక్కడ వెట్టి రాజ్యాంగ సంస్కరణములను చేయుటకు

ప్రయత్నింపలేదు. అంగుల్ జిల్లాకూడా అటువంటి వెనుకబడిన ప్రాంతమే. ఈ ప్రాంతములందలి అనాగరకులు ఆర్యులరాకకు పూర్వమీదేశమున నుండిన ఆదివాసుల జాతులకు చెందిన వారేయని కొందరి యూహ. వీరందరును దుర్గమములైన అరణ్యములలోనికి పోయినందున ఆర్యు లందు ప్రవేశింపలేక పోయిరని చెప్పుదురు. వీరు వేటవలనను, పోడు వ్యవసాయమును చేసియు జీవింతురు. కొండలోయలలో నీ ఆటవిక జాతులవారు కొన్నిచోట్ల నిలకడమైన వ్యవసాయమును కూడా చేయు చుండిరి. అక్కడ పంటలు విరుగ బండుచుండెను.

ఇంగ్లీషుపరిపాలనమును స్థాపించకపూర్వము హిందూదేశములోని తక్కిన ప్రాంతప్రజలీ ఆటవిక జనముయొక్క పొలములపైన ఆశపడ లేదు. కారణమేమనగా ఆకాలమున ఆ పొలములవలన శిస్తులను వసూలు చేయుట దుస్సాధ్యముగ నుండెను. ఇంగ్లీషు పరిపాలనమునందు ప్రవేశ పెట్టబడిన న్యాయశాస్త్ర విధులవలన న్యాయస్థానములవలన షావుకా రుల పుణ్యము పుచ్చెను. వారీ అనాగరకులకు ఋణములిచ్చి బాకీలకు వ్యాజ్యములువేసి డిక్రీలు పొంది వారిని తమ బానిసలుగా చేయసాగిరి. ఇంగ్లీషువారి పరిపాలనము వచ్చినది మొదలు నాగరక ప్రాంతములందలి జనులు అనాగరిక దేశములోపలి భాగములలోనికి క్రమక్రమముగా చొచ్చుకొని పోవసాగిరి. "ఆటవిక జాతులు అమాయకులు దూరాలోచ నము లేనివారు. అందువలన వారు ఋణదాతల చేతులలో పడిపోవుచుం దురు. వారికి విద్య లేనందువలనను వారు ప్రత్యేకభాష మాట్లాడుటవల నను, న్యాయస్థానములందు వారికి చాలా ఇబ్బంది కలుగుచుండును. వారికి నిజముగా అన్యాయములు కలిగినప్పుడుగాని తనకు అన్యాయము జరిగినదని వారికి తోచినప్పుడు కాని వారిలో అసంతృప్తి విప్లవాగ్ని చెలరేగి జాతి కట్టుబాటులవలన అది త్వరితముగా నలుప్రక్కలకును వ్యాపించును. వారు కేవలము చిన్నపిల్లలవంటివారైనందున వారిని శాంతింపజేయుట చాలా కష్టతరమైనకార్యముగా నుండును"అని బీహారు ఒరిస్సా రాష్ట్రప్రభుత్వములవారు ఆ రాష్ట్రములలో వెనుకబడిన ప్రాంత మునుగూర్చి సైమనుకమిషను వారికొక మెమోరాండమును సమర్పించిరి.

# 6. కోల్ జాతివారి తిరుగుబాటు

కోల్ జాతివారు 1832 లో కుంపినీ వారిపైన తిరుగుబాటు చేసిరి. వీరు చాలా తీవ్రముగా పోరాడి నందువలన ఇంగ్లీషువారు తమ తెల్ల సైనికులను సిపాయిలను చాలామందిని పంపి యుద్ధము చేయవలసి వచ్చెను. వీరి తుపాకీగుండ్ల వర్షముముందు కోల్ జాతివారి విల్లుఅమ్ములు బల్లెములు పనిచేయలేదు. అయినను వారు చాలా ధైర్యముగా పోరాడి నందువలన చాలా జననష్టము కలిగెను. ఇంగ్లీషువారికి చాలా మందు గుండు సామగ్రి వ్యయమయ్యెను వారు చాలా సొమ్ము ఖర్చుపెట్టవలసి వచ్చెను. కోల్ జాతివారి గ్రామముల నింగ్లీషు సైన్యములు తగులబెట్టి చాలామందిని వధించిరి. ఎంతో కష్టముపైన నీకోల్ జాతివారు యుద్ధము విరమించిరి. ఈ తిరుగుబాటున కింగ్లీషువారెన్నో కారణములను చెప్పిరి. గాని నిజమైన కారణములనుమాత్రము ప్రకటింపరైరి. ప్రభుత్వోద్యోగులు చేసిన అన్యాయములు, దుర్మార్గములును దుష్పరిపాలనమును దోపిడియు దీనికి నిజమైన కారణములు. ఈ యుద్యోగులు లంచములు పుచ్చుకొని తమ అధికారమును దుర్వినియోగము చేయుచు అక్రమములుచేయు వ్యక్తులకు తోడ్పడుచుండిరి. *

సంతాలు జాతివారిని బెంగాలీ, బిహారీ, భూస్వాములు బాధించుట వలన వారిలో తీవ్రమైన అసంతృప్తి కలిగి వారు 1835 లో తిరుగుబాటు చేసిరి. ఇంగ్లీషు కుంపినీవారు స్థాపించిన న్యాయస్థానములందు వారి న్యాయశాస్త్ర విధుల ననుసరించి న్యాయమును పొందుటకు సంతాలులు ప్రయత్నింపలేదు. వారికి కనబడిన బంగాళీవారినెల్లరను చిత్రహింసలు

---

*Notes on Indian Affairs Shore, vol I. pp 145–166.

పెట్టి దంపి నాశనముచేయుట ప్రారంభించిరి. అప్పుడు కుంపినీవారు తమ రెగ్యులరు సైన్యములను పంపి ఈ తిరుగుబాటును అణచవలసి వచ్చెను. దానినణచిన పిమ్మట సంతాలులు నివసించు ప్రాంతము నొక ప్రత్యేక పరగణాగా నిర్మాణము చేసిరి. బంగాళము ఒరిస్సా రాష్ట్రము లతో అమలుజరుగు రెగ్యులేషను శాసనవిధులను సామాన్యపరిపాలన మును అమలుజరుపబూనుట నిష్ప్రయోజనమని కుంపినీవారికి అవగత మయ్యెను.

1855లో సంతాలులు చేసిన తిరుగుబాటు చాలా తీవ్రమైనది. బంగాళాదేశములోని రెగ్యులేషను శాసనవిధులవలన సంతాలుల బాధలు దుర్భరమయ్యెను. తమ బాధలను గూర్చి చెప్పుకొనుటకు సంతాలులు కలకత్తాకు బయలుదేరి దారిలో గ్రామములను దోచుకొనుచు ప్రజలను హింసింపసాగిరి. అంతట కుంపినీ దొరతనమువారు శిక్షార్థపు పోలీసు దళమును చాలా పెద్దదానిని తయారుచేసి దానితో అక్కడ వారిని అణచియుంచిరి. ఈ తిరుగుబాటు జరిగిన తరువాత నీప్రాంతమునందు సామాన్య పరిపాలనా విధానమును పూర్తిగా రద్దుచేసిరి. వీరికొంతు భూసంబంధములైన ప్రత్యేక శాసనములను గావించిరి. వీరి నేరములను వివాదములను విచారించుటకు ప్రత్యేక న్యాయస్థానముల నేర్పరచిరి.

ఇంగ్లీషువారెన్ని కట్టుబాటులు చేసినను పరిసర ప్రాంతము లందున్న బంగాళీవారీ అటవిక ప్రజల దేశములో ప్రవేశించి వారిని పీడించుచు లాభములను పొందుచునేయుండిరి.

'అంగుళ్'జిల్లా ఒరిస్సాలోనిది. ఇందులో నూటికి 74మంది ఆది మవాసులుగా నున్నారు. ఇది ఇంగ్లీషువారి చేతులలోనికి చాలా ఆలస్యము గనే వచ్చెను. వారికి వశముకాగానే ఇందులో ప్రత్యేక ప్రభుత్వవిధాన మును స్థాపించిరి.

ఛోటా నాగపూరు. పీఠభూమిలోని ఆదిమజాతివారికి సంబంధించిన సమస్యలు చాలా క్లిష్టమైనవిగా నుండెను. దుర్గమములైన అడవిలో ఆదిమవాసుల జాతివారు నివసించు ప్రాంతమును ఆర్యజాతివారు "జార్ఖండు" అని వ్యవహరించుచుండిరి. అక్కడి జనాభాలో ఈ అనాగ

రిక జాతులవారు నూటికి 68 మంది యుండిరి. తమ పిత్రార్జితపు భూములను లాగివేసిరని నాగరక హిందువులపైన వీరికి కోపముండెను. భూమి సంబంధములైన సమస్యలలో ప్రారంభమైన అసంతృప్తి త్వరలోనే మతాచారములకు సంబంధించిన విరోధముగా పరిణమించెను. అందువలన ఇంగ్లీషువారు తమ సైన్యము నక్కడ నిలువయుంచి వారిని అణచియుంచుట అవసరమయ్యెను

ఈ ప్రాంతములందు క్రైస్తవ మతబోధకులు ప్రచారము చేయసాగిరి. ఇక్కడ ఆంగ్లికన్, రోమన్ లూథరన్ మిషనరీలు ప్రచారముచేయుచు రాంచి జిల్లాలోనుండి 28000 మందిని కిరస్తానీ మతమునందు కలిపిరి ఈ మిషనరీలు పాఠశాలలు స్థాపించి, ఈ ఆదిమ వాసులకు చదువు నేర్పుచుండిరి. "హిందూదేశములోని ఇతర ప్రాంతములవారక్కడికి వచ్చి ఈ అమాయకులకు అన్యాయము చేయకుండుట" కని ఇంగ్లీషువారనేక శాసనవిధులను నిబంధనలను చేసిరి. ఇంగ్లీషువారును క్రైస్తవులు మాత్రము అక్కడికి వెళ్లియుండుట కభ్యంతరము లేదు ఇంగ్లీషువారి ప్రభుత్వము క్రింద నుండిన భారతదేశ మధ్యరాష్ట్రములు యొక్క విస్తీర్ణములో నైదవవంతు రిజర్వు చేయబడిన అడవిగా నుండెను. ఆ రాష్ట్రములోని వివిధ సంస్థానములను టీరాయుపరగణాలు మినహాయించినచో మిగిలిన భాగమంతయు వెనుకబడిన ప్రాంతముగా పరిగణించి సామాన్య శాసనవిధులు పరిపాలనావిధానమును దానికి వర్తింపకుండా చేసిరి. నిజముగా నివి వెనుకబడిన ప్రాంతములు గాకపోయినను ఏయేశాసనవిధులను వానికి వర్తింపచేయవలెనో నిర్ణయించు అధికారం, కార్యనిర్వాహక పరిపాలకవర్గమువారి కిచ్చిరి.

అస్సాము రాష్ట్రముయొక్క విస్తీర్ణము 77500 చదరపు మైళ్ళు. అయితే ఇందుసగమువంతు కొండలదేశము, పరిహద్దు ప్రదేశముగా నుండి చాలావఱకు సర్వేకొలత లేక అనిర్దిష్టముగా నున్న ప్రాంతముగా నున్నది. తూర్పున "ఖాసీ" కొండలు జైంతాకొండలును చాలా దట్టమైన కీకారణ్య మధ్యమున నున్నది. వీని కిరుప్రక్కలను బ్రహ్మపుత్రా సుర్మాలోయలలో నాగరక ప్రాంతదేశమున్నది.

అస్సాములో సామాన్యవ్యవసాయము తేయాకుతోటలు. ఇవిచాలా లాభప్రదముగా నున్నవి.

అస్సాములో వెనుకబడిన ప్రాంతములు చాలా పెద్ద విస్తీర్ణము కలిగి ప్రాముఖ్యత కలిగియున్నవి. అక్కడి అడవిజాతివారియొక్క మతాచార వ్యవహారములు తక్కిన ప్రాంతములకు కేవలము భిన్నముగా నుండును. ఈ ప్రాంతమునందు "లూషాయి"కొండలు, నాగకొండలు "గ్యారో"కొండలు, "కాచారు"కొండలు, "ఖాసీ,జైనితా" కొండలలో ఇంగ్లీషువారికి హక్కుకలిగిన భాగములు చేరియుండెను. దీనికి లఖ్మిపూరు సరిహద్దు ప్రాంతమును, బలీపరాసరిహద్దు, సరియసరిహద్దు ప్రాంతములు చేర్చవలెను. ఈ చివరప్రాంతము అబోరుదేశము, టిబెట్టు దేశము దగ్గరవరకు వ్యాపించెను. డియాగడు, కొహిమాప్రాంతములు నాగదేశమధ్య నున్నవి. ఈ ప్రజల జీవితవిధానము ఆచారవ్యవహారములు చాలా విచిత్రములైనవి. దానికొక పరిపాలనా విధానము నేర్పరచుట చాలా కష్టసాధ్యమైన కార్యమని సైమను కమిషనువారనిరి. ఈ ఆదిమజాతులు ప్రపంచములోకెల్ల ఆకర్షవంతములైన జాతులని చెప్పవచ్చును. వారీ నవీననాగరక ప్రపంచముతోటి సంపర్కమువలన నిర్వీర్యులైరి. వారి ఔదార్యము, ఉత్సాహము నిరుపమానములుగ నుండెను.

"నాగులు," "ఒకీలు," "మిషిమీలు" మొదలైన ఈ ఆదిమ వాసుల జాతులవారికి, బంగాళీవారును తేయాకుతోటల యజమానులైన దొరలును శత్రువులై వారి క్షేమలాభములకు భంగము కలిగింపసాగిరి. ఈ ఆదిమవాసులు ఆత్మగౌరవమునకు శౌర్యప్రతాపములకు భంగము కలిగెను, వారి దేవతలపైన నమ్మకము చెడెను. తండ్రివంకనుంచి తల్లివంకనుండి వంశ పారంపర్యముగ వారి జాతి ఆచారములు, వారి జీవితములను సంకుచితము చేసెను అడవులలో అదివరకు వారు స్వేచ్ఛగా తిరుగుచు చెట్లను నరికివేసి "పోడు" వ్యవసాయము చేసికొనుటకు ఇంగ్లీషు దొరతనములోని ఆటవిక శాఖవారును నాగరక ప్రజలును వారి కాటంకములు కలిగించిరి.

ఈ కొండజాతుల వారిలో బహు సంఖ్యాకులు తమ పూర్వపు పద్ధతులను మఱువలేదు. సాధారణముగా వారు కొండలదిగువ గ్రామములపైన దండయాత్రలు చేయుచుండిరి. ఇంగ్లీషు పరిపాలనలో వారికిది వీలులేకపోవుటవలన వారు అసంతృప్తి వహించిరి. ఇంగ్లీషు పరిపాలన వలననే చుట్టుప్రక్కల నాగరకప్రాంత జనములు నీయాటవిక ప్రాంతములలో చొరబడి అనేకలాభములు పొందుట కవకాశము కలిగెను. అస్సాము రాష్ట్రములో నింగ్లీషువారు సరిహద్దులకు చాలా దూరమున షిలాంగులో (రెండుపటాలములు) రెండు బటాలియనుల సైనిక దళములను సుస్థిరముగానెలకొల్పియుంచిరి. అయితే అస్సాములో నింగ్లీషువారికి 5 బటాలియనుల తుపాకి సైనికదళము లున్నందువలననే ఆ సరిహద్దులలో కల్లోలము జరుగకుండా యుండెననుట అందఱెఱుగుదురు. ఈ సైనిక దళములలో నొకటి 'లూషాయి' కొండలో అయిజల్ (Aijal) దగ్గర నుంచి, దానికి అనుబంధ స్థావరముగా టూయిపాంగ్ దగ్గర చిన్నదళమును నిలిపిరి. ఇంకొకదళము నదియ సరిహద్దు దగ్గరనుంచి అబోరులు, మిరీసులు, మిషిమీలు, ఖమటీలు, సింగ్‌ఫోలు, నివసించు కొండల క్రింద అనుచయపు స్థావరములనుంచిరి. మూడవ బటాలియను నాగజాతి వారి మధ్య "కోహిమా"లో నుంచిరి. ఈనాగులు నిరంతరము యుద్ధములు చేయుచుండిరి. వారిలోవారు రగవులాడుచుండిరి నాలుగవ బటాలియను మణిపూరు రాజ్యమున "ఇంఫాలు"లో నుంచిరి. అక్కడి కుకీలు తిరుగుబాటు చేయుచుండిరి. ఐదవ సైనికదళము బలిపరా సరిహద్దులోనుంచి అకా, దాఫ్లా, అపటనంగ్ కొండమిరి జాతివారిని, అదుపులో నుంచెను.

అస్సాము తుపాకి సైన్యములో సగము మందిగూర్ఖాలుండిరి. తక్కిన సగముమంది ఆ రాష్ట్రములోనివారిని చేర్చుకొనదలచినను. అస్సాములోని ఇతరప్రాంతములవారిందుచేరుట కిష్టపడరైరి. అదిమవాసులలో లూషాయిలు కూకీలు కొండలు సైన్యమున చేరుటకు వచ్చినను వారిని తమ దేశముదాటి ఇతరప్రాంతములకు పోవుట కంగీకరిం

వరు. అట్టివారు తమ జాతిపైన యుద్ధము చేయవలసివచ్చినపుడు చాలా చిక్కులు కలుగునని ఇంగ్లీషువారెరుగుదురు. అందువలన నీవిషయ మున జాగ్రత్త వహించిరి. ఇందువలననే ఆ సైనికదళము చాలా బలవంతమై ఆదిమవాసులను అదుపులో నుంచెను.*

* Report of the Simon Commission p p. 56-76

# 6. ఉత్తరసర్కారు

# కొండ "జమీందారు"లు

1767 లో ఉత్తరసర్కారులు ఇంగ్లీషువారి వశమైనప్పటినుండి 1822 వఱకును తరుచుగా మన్యములందు పితూరీలు జరుగుచున్నందు వలన దీనినిగూర్చి విచారించుటకై మద్రాసు గవర్నరైన సర్ థామస్ మన్రోగారు 1822 లో బయలుదేరి ఉత్తరసర్కారులలో పర్యటనముచేసి సంగతి సందర్భములనెల్ల తెలిసికొని 1823 జనవరి 24 తేదీన ఒక మినిటులో వ్రాసిరి.

ఉత్తరసర్కారులను నిజామలీగారు ఇంగ్లీషువారికి 1762లో ఇచ్చి యున్నను అప్పటికి జిల్లాలు హుస్సేనలీ అనునాతని కవులులోనుండెను. వానిని 1769 నుండి కుంపిణీవారు స్వయముగా పరిపాలింపసాగిరి. పూర్వము నిజాముక్రింద నుండగా నీ దేశములో తూర్పు సముద్రతీరము నంటియున్న దేశములో సారవంతములును జన సంకీర్ణములునైన భూములన్నియు మొగలాయిసర్కారు వారి యుద్యోగుల క్రిందనే యుండెను. వారికిట్లు ప్రజలపైన ప్రత్యక్షమైన అధికారమున్నందువలన ఆజిల్లాలలోనేగాక వాని నగరములలో చిన్నచిన్న జమీందారులు మొదలైన భూస్వాముల క్రిందనున్న దేశభాగములో కూడా సర్కారుకు గొప్ప పలుకు బడి యుండెను. అందువలన వారికి ప్రత్యేకముగా సైనికపోలీసు బలము అవసరములేకుండా ఆ ప్రాంతజనులకు సర్కారుపైన భయభక్తులు కలిగి వినయవిధేయతలతో ప్రవర్తించుచుండిరి అకతాయి జనమును సర్కారు వారు అదుపులో నుంచగలుగుచుండిరి. అందువలన శాంతికి భంగము కలుగకుండెను.

కుంపినీవారికి యుత్తర సర్కారులు వశమగు నాటికి దేశములో చాలా భాగమిట్లు సర్కారువారి స్వంతభూమిగా నుండెను. మిగిలిన దేశములోని చిన్నచిన్నరాజులను జమిందారులను విజయనగర రాజాగారు అణచి వేసి వారి జమీందారీలను తమ రాజ్యములో కలుపుకొని యుండిరి. అందువలన కుంపినీవారు తలచుకొన్నచో నొక్క విజయనగర జమీం దారుగారిని అణచినచో నీప్రాంతమంతయు వారికి లోబడి యుండును. అయితే కుంపినీవారట్లు చేయక విజయనగరము జమిందారుగారి బల మును తగ్గించుటకై కుటిల రాజ్యతంత్రమును ప్రయోగించి వారదివరకు పదచ్యుతులను చేసిన చిన్న చిన్న కొండ జమీందారులకు వారి వారి భూవసతులను మరల నిచ్చిరి. దీనివలన అప్పటికి వీరి యుద్దేశము నెర వేరినట్లు కనబడినను తరువాత నది విపరీతముగా పరిణమించినది.

ఈ చిన్న జమీందారీలలో కొండలు అడవులు గల మన్యప్రాంత ములుండెను. అవి అనారోగ్యకరములై యుండెను. కుంపినీవారి సైని కోద్యోగులను సిబ్బందియు నీప్రాంతములకుపోయి ఈ చిన్న జమీందా రులు బాకీలివ్వనప్పుడు వీనిని పట్టుకొనుటయు వీరు తిరుగబడినప్పుడు వీరిని అణచుటయు చాలా దుస్తరకార్యముగా నుండెను. కొద్దిమంది సిబ్బందిగల చిన్న చిన్న కొండజమీందారులు కుంపినీవారి సైనిక దళమును ప్రతిఘటించి అడవులలోను కొండలలోను తప్పించుకొని తిరుగుచు, పరిసర గ్రామములను కొల్లగొట్టి దోపిడిచేసి లాభము పొందు టకు దండయాత్రలు సాగించుటకు సంసిద్ధులగుచుండిరి. ఇటువంటి చిన్న జమీందారుల సంఖ్య హెచ్చుగానున్న కొలది దేశములోని పెద్ద రాజులవలన జమీందారులవలన కలుగు చిక్కులకన్న హెచ్చుచిక్కులు కలుగుచు నీపితూరీలు తీవ్రమైన యుద్ధముగా పరిణమించుచుండెను. మొదట నీ చిన్న చిన్న జమీందారులు కుంపినీకి బాకీపడి పేచీలుపెట్టి తిరుగుబాటు చేసినప్పుడు కుంపినీవారు దీక్షవహించినందునను వారు చేయు అన్యాయములను దుర్మార్గములను ప్రజాపీడనమును మొదటనే అణచివేయనందునను వారు ధైర్యము వహించి విజృంభించిరి. తిరుగు బాటు చేసినవారు తమ బాకీలను చెల్లించినప్పుడు వారి భూవసతులు వారికి

మణులనిచ్చు పద్ధతియు వారి పితూరీలు చేయుటకు ప్రోత్సాహమొసగెను. వీరిపైన వెంటనే తగిన చర్యను తీసికొనకపోవుటకు కారణముండెను. వీరిపైన సైనికబలము ప్రయోగించుటకు ప్రయత్నించినచో ఈ దోపిడి గాండ్రతో మనము సంకులసమరము చేయవలసి వచ్చుననియు అనారోగ్యకరములును దుర్గమములునైన అడవులు కొండలుగల ఈ మన్యములలో నిటువంటి యుద్ధములలో చిక్కుకున్నచో అది సులభముగా తెమలక చాలాకాలము పట్టుననియు, మనకు చాలా నష్టము కలుగుననియు తలచియే ఇట్లు ఉపేక్షించితిమని అందువలననే వీరిలో భయభక్తులనశించి పితూరీలు హెచ్చినవనియు మన్రోగారు వ్రాసిరి.

ఈ చిన్నచిన్న కొండజమీందారులు కుంపినీవారికి చెల్లించవలసిన స్వల్పపు మొత్తములనుకూడా చెల్లించక బాకీలుపెట్టి వీరైనప్పుడెల్ల తిరుగుబాటులు చేయసాగిరి. ఇది అంటువ్యాధివలె వ్యాపించెను. వీరిట్లు తరుచుగా పితూరీలుచేయుచు స్వతంత్రరాజులవలె ప్రవర్తించుచున్నందు వలన కుంపినీవారి ప్రభుత్వము బలహీనమైనది. కొండ జమీందారీలలో తటస్థించిన పితూరీలను గూర్చియు అక్కడి పరిస్థితులను గూర్చియు మన్రోగారు కొన్ని యుదాహరణము లిచ్చిరి.

“నే నీ సర్కారులలో పర్యటనము చేయుటలో కిమిడిలో నుండగా కొన్ని విచిత్రములు తెలిసినవి కిమిడిరాజాగారి జమీందారీలో చాలా భూములు అడవులలో నున్నవి. ఈ అడవిభూములలో కొన్నిటికి రాజాగారి కొలువులోనున్న ఆయుధపాణులైన బంటుమాన జనమునకు చౌకదారు శిస్తులకు ఇనాములుగా ఇచ్చి కొండల కనుమలనుండు దేశము నుండి ఎవ్వరును వచ్చి దేశమును కొల్లపెట్టకుండా కాపాడు బాధ్యతను వారి యందుంచిరి. ఈ బంటుమాన జనమునకు బిస్సోయిలను నాయకు లుండిరి. అటువంటి నాయకులీ కిమిడిలో తొమ్మిదిమంది యున్నారు. వీరి గ్రామములు పడమరకొండల దిగువ నున్నవి. ఇట్టి స్థితిలో 1815 లో పిండారీదండులు వచ్చిపడి ఈ దేశమును కొల్లపెట్టుచుండగా నీ బంటుమానజనము చూచుచు నూరకొనిరేగాని వానిని ప్రతిఘటింపరైరి. నిజమునకు వీరు వారిని ప్రతిఘటించుటకు శక్తిసామర్థ్యములు కలవారును

కారు. వీరు చాలా బలహీనులగును యుద్ధములు చేయుటకు అసమర్థులునై యున్నారు. వీరిట్లు తమ కర్తవ్యాలను నిర్వహింపలేకున్నను తాము సర్కారుకు చెల్లించవలసిన స్వల్పపు శిస్తునుకూడా చెల్లించక బాకీపెట్టిరి. పిండారి దండయాత్రజరిగినప్పటినుంచి (అయిదు సంవత్సరములనుండి) బాకీలు కలెక్టరువారివలన వసూలు చేయలేకపోయెను. ఇందులోని చిత్ర మేమనగా అదివరకు వీరు జమీందారుకు లోబడినవారై యుండగా జమీందారు అధికారములను తగ్గించి కుంపినీవారి యధికారమును హెచ్చు చేయవలెననియే వారిని కలెక్టరుకు లోబరచి వారివలన శిస్తులు వసూలు చేయు అధికారము వారికిచ్చిరి. అట్టి అధికారము నిచ్చిరేగాని అందులోని చిక్కులను గమనింపలేదు. వీరి భూవసతులు జమీందారీ లోపలి భాగములో నుండెను. కలెక్టరుకు అందుబాటులో లేవు అందువల్లనతడు వారిని అదుపులో నుంచలేకుండెను.

"దేశములోని ప్రజల ధనమునకు మానమునకు ప్రాణములకు రక్షణ కలిగించి దేశములోని అల్లరులను అణచి దోపిడిదారులను దండయాత్రలను పితూరీలను అణచివేయనిచో కుంపినీవారికి గౌరవమెట్లుండును? గౌరవములేనిచో వారి పరిపాలనమును సరిగా జరగదు. ఇది వరకు కుంపినీవారవలంబించిన పద్ధతులందుకు అనుగుణముగా లేవు" అని మన్రోగారు వ్రాసిరి.

కొంత జమీందారీల పరిసరములనున్న గ్రామము లితరజమీందారుల క్రింద నున్నవేగాని కుంపినీవారి క్రింద లేకుండెను. అందువలన ఆ గ్రామములలో కుంపినీవారికి పలుకుబడి లేదు. ఆ గ్రామనౌకరులు అక్కడ ప్రజలు జమీందారులకు లోబడి వారిపట్ల భయభక్తులు కలిగి యుందురు. గాని కుంపినీవారికి లోబడి వారిపట్ల భయభక్తులు కలిగి యుండరు. కారణమేమనగా వారికిగాని వారి కుటుంబములకు గాని కుంపినీవారే యుపకారమును చేయజాలరు. ఆ గ్రామ జమిందారునికి కొంతజమీందారునికిని లోపాయికారీగా సంబంధములు మొగమాటములు నుండును. అందువలన గ్రామములోని సిబ్బందియు ప్రజలును తమ జమీందారుకి స్నేహితునికి వ్యతిరేకముగా కుంపినీవారికి సహాయము

చేయరు. అట్లు చేసినచో వారక్కడ జీవించజాలరు. ఇటువంటి పరిస్థితులున్నందువలననే మన్యములలో పితూరీలు పుట్టుచుండ కుంపినీవారు అణచలేకుండిరి. ఆ మన్యప్రాంతములందు కుంపినీవారికి పలుకుబడి లేనందువలన అక్కడి సమాచారములు వీరికి సరిగా తెలియుటకుకూడా అవకాశములేకున్నవనియు అందువలన కొండజమీందారులు తరుచుగా కుట్రలు చేయుచు తిరుగుబాటు చేయుచున్నారనియు అనారోగ్యకరములైన ప్రదేశములకు కుంపినీవారి యుద్యోగులు పోయి స్థిరముగా నుండుటకు గాని కొంతకాలము నిలకడగా నుండి క్రమపరిపాలనము స్థాపించుటకుగాని అవకాశము లేనందువలన ఈ చిన్న చిన్న కొండ జమీందారులు స్వతంత్రులుగా వ్యవహరించుచున్నారనియు శిస్తులు చెల్లించక పేచీలు పెట్టుట వీలైనప్పుడెల్ల తిరుగుబాటు చేయుచున్నారనియు మన్రో గారు స్పష్టముగా వ్రాసిరి. ఆయన ఇంకనిట్లు వ్రాసిరి. "గంజాము జిల్లాలో నేను పర్యటనము చేయుచుండగా అక్కడి ప్రజలకును కుంపినీ ప్రభుత్వమునకును బొత్తిగా సంబంధమున్నట్లే కనబడలేదు. ఆ గ్రామములలో నొక్కడైనను నావద్దకువచ్చి తన బాధలను గూర్చిగాని తన యావశ్యకతలను గూర్చిగాని నాకు చెప్పుకొనలేదు. వారేమి చెప్పుకొనదలచినను తమ జమీందారుగారి దగ్గరకే పోయి చెప్పుకొందురు. పూర్వము ఉప్పు ఇజారాపాకి సర్కారుకచ్చేరీలకు పోవు నలవాటుగల ఉప్పు తయారు చేయువారు మాత్రము నా దగ్గరకువచ్చి కిమిడిరాజావారి బంటు ఒకడు తమవలన హెచ్చుశిస్తు వసూలు చేయుచున్నాడని ఫిర్యాదుచేసిరి. అయితే అందులోకూడా ఒక చిత్రము జరిగెను. ఆ సొమ్మును ముజరా ఇచ్చెదనని అతడొక పత్రము వ్రాసియివ్వగా వారు కోర్టులో వ్యాజ్యమువేసిరి. తరువాత రాజీపడిరి. అతడు తన మనుష్యుల నుండి ఆ పత్రమును బలవంతముగా తీసికొని పోయెనట.

కొండజాతివారు అల్లరులు సాగించుచున్నారని చికాకోలులో పాలకొండ జమీందారుగారి దివాను నాతో చెప్పినాడు. వారిని అదుపులో నుంచకపోవుట మీదే లోపము కదాయని నేనంటిని. కొండజాతి వారి సంఖ్య చాలా స్వల్పముగా నుండి వారిప్రక్క నుండు నాగరకజనుల

సంఖ్య చాలా హెచ్చుగానుండి అన్ని విషయములలోను వారు సంబంధములు కలిగియున్నప్పుడు వారిని మీ జమీందారుదేల అదుపులో నుంచలేక పోవుచున్నారని నే నడిగితిని. కొండజాతివారు జమీందారుగారికి పూర్తిగా లోబడియున్న సంగతి నిజమేననియు అయితే కొంతకాలము క్రిందట జమీందారుగారు కుంపినీవారికి పేష్కుషుబాకీ పడగా కుంపినీ వారాయననుపదచ్యుతునిచేసి పట్టుకొని ఖైదుచేయుటకు ప్రయత్నించిరనియు అపుడాయన కొండజాతివారి దేశమునకు పోయి తలదాచుకొనెననియు అందువలన వారికాయనయందు పూర్వముండిన భయభక్తులు తగ్గిపోయినవనియు ఆయన మాటల వారిని లోబరచుకొనలేకున్నాడనియు చెప్పిరి.

దివానుగారు దేశములో దోపిడ్లుచేయు ఆతతాయి జనమును పట్టుకొని అణచు విషయములో మన్రోగారి కీక్రింది సంగతులు చెప్పిరి - పూర్వమిట్టి దోపిడిగాండ్రు వచ్చినప్పుడు వారిని జమీందారుసిబ్బంది కత్తులతోను కఠారులతోను గాయపరచి కొందరిని పట్టుకొని చెట్లకు విరచి కట్టి అణచుచుండిరి. ఇటీవల కుంపినీవారు ప్రవేశపెట్టిన క్రొత్త క్రిమినలు న్యాయపరిపాలనా విధానముల వలన అట్టివారిని పట్టుకొనుటలో వారికి గాయములు కలిగించుట యొకనేరముగా నెంచి తమ పరిజనముపైన కేసులుపెట్టి విచారించి శిక్షించుచున్నారనియు బలప్రయోగము చేయకుండా దుండగీండ్రను పట్టుకొనుట సాధ్యముకాదనియు ఆయన చెప్పెను. దుండగీండ్రు దుర్మార్గములు చేయుటకు వచ్చినప్పుడు వారిపైన బలప్రయోగము చేయుటకు గాయపరచుటకును అభ్యంతరము లేదనియు నీ విషయమై కొత్త యుత్తర్వులు జారీ చేయబడినవనియు వానిని మీరు చూడలేదాఅని మన్రోగా రడుగగా ఆ యుత్తరువులలో నొక నిబంధనతో ఆ దోపిడిగాండ్రు సాక్షాత్తుగా దోచుకొనుచున్నప్పుడును దోచుకొని పారిపోవుచున్నప్పుడును వారిపైన బలప్రయోగము చేసి గాయపరుప వచ్చునని యున్నదనియు, ఆ దుండగీండ్రు తిరుగుబాటు చేసినపుడు వారిని గాయపరుప వచ్చునని కుంపినీవారు స్పష్టముగా నుత్తరువు చేయవిది లాభము లేదనియు దివానుగారనిరి.

రంపదేశము రాజమహేంద్రవరమునుండి రమారమి ముప్పదిమైళ్ళ దూరమున కొత్తపల్లి తాలూకానుండి విశాఖపట్టణముజిల్లాలో గోలుకొండ జమిందారీ వరకును పడమర సరిహద్దున నిజాము రాజ్యమువరకును వ్యాపించియున్నది. దీనికి లనుకొనియున్న మరికొన్ని మొఖాసా గ్రామములకెట్టి పేష్కషు చెల్లించనక్కరలేకుండు పద్ధతిపైన కుంపినీప్రభుత్వమువారు రాజా రంపరామ భూపతిగారికి 1813లో దీనినిజాగీరుగా నిచ్చిరి. మన్రోగారు గోదావరి నదివరదవలన రాజమహేంద్రవరమున ఆగవలసి వచ్చెను అప్పుడు రంప జమిందారుగారికుమారుడు వచ్చి ఆయనను దర్శించెను. ఆ దేశము అనారోగ్యకరమైన కొండలతోను అడవులతోను నిండియున్నదనియు, ఆ జమిందారుడు పూర్వమునుండి స్వతంత్రుడుగానే యుండెననియు, పూర్వమునుండి వారి కుటుంబమువారికి హక్కుగల నాలుగు గ్రామములను మరల నీయునటు కుంపినీవారు 1813 లో నిచ్చినప్పుడు ఉభయులమధ్య ఒడంబడికలు జరిగెననియు, కుంపినీ వారి రాజ్యాధికారము నతడంగీకరించి నేరములు చేసినవారిని పట్టియుచ్చుట కంగీకరించుటయేగాక గోదావరిపైన నెట్టిపన్నులును వసూలు చేయకుండుటకు నంగీకరించెననియు మన్రోగారు వ్రాసిరి. నిజముగా కుంపినీకెట్టి సంబంధము లేనట్టియు, ఆ జమిందారుని వశమునందే యున్నట్టియు రాజ్యభాగములను అతనికిచ్చినట్లు ఆ యొడంబడికలో వ్రాయుట, కలెక్టరు కోరిక ప్రకారము ఆయన రాజ్యమునకు అంటియుండక దూరముగా నున్న గోదావరిపైన తాను నిజముగా విధించుటకు అవకాశమే లేని పన్నులు విధింపకుండునని అంగీకరించి ఆయన ఒడంబడికలో వ్రాయుట, ఈ రెండును వింతగానే యుండెనని మన్రోగారు ఆశ్చర్యపడిరి. ఆకాలమునకుంపినీవారికుటిలరాజ్యతంత్రములందిట్టివి తరుచుగాజరుగుచుండెను.

ఇటీవల పోలవరముపైన కొండజాతివారు చేసిన దండయాత్రల నితడు ప్రోత్సహించెనని తనకు చెప్పిరనియు అతనికి యొడంబడిక ప్రకారము ఇవ్వబడిన నాలుగు గ్రామములవలన వానికి ఆదాయము రాగలదనియు అందువలన నతడు కుంపినీవారితో స్నేహముగా నుండగలడనియు మన్రోగారు వ్రాసిరి.

---

Appendix xi Prakasam Committee Report pp126-137
Minute of Sir Thomas Munro. 24 - 1 - 1823.

# 7. గోదావరి మన్యము

భద్రాచలము, రేకపల్లి తాలూకాలును రంపదేశమును, దూచ్చెర్తి, గుడిసేరు ముఠాలును, కొండగ్రామములును, యర్నగూడెము పెద్దాపురము తాలూకాలలోని కొండముఠాలును కలిపి ఇంగ్లీషు దొరతనమువారు "గోదావరి ఏజెన్సీ" మన్యప్రాంతముగా చేసిరి. భద్రాచలము రేకపల్లి తాలూకాలకు ఇంగ్లీషువారొక స్పెషల్ అసిస్టెంటు ఏజెంటును నియమించిరి. అతని ముఖ్యపట్టణము కూనవరము. ఈ యేజెన్సీ 1690 చదరపుమైళ్ళ విస్తీర్ణము 96727 జనసంఖ్య కలదైయున్నది. ఈ ప్రాంతములు వివిధ స్థాయిలలోనున్న నాగరికతను అభివృద్ధిని కలిగియున్నవి. ఈ దేశములో అడవులు కొండలు వ్యాపించియున్నందున రాకపోకలు కష్టము. మన్యమైనందున ఇది అనారోగ్యకరమైనదేశము. ఇందులో వివిధరకములైన భూస్వామిత్వపు శిస్తుల నిర్ణయము వసూలు పద్ధతులున్నవి. రంపదేశము రాజమహేంద్రవరమునుంచి రమారమి ఇరువదిమైళ్ళ దూరమునుంచి రెండు వేలు మొదలు నాలుగువేల అడుగులవరకు యెత్తుకలిగిన కొండలతో గోదావరి యుత్తరపువైపున సీలేరు నదివరకును వ్యాపించియున్నది. అది అడవులు గల మన్యము. అక్కడనున్న రంప అను గ్రామమువలన దీనికి రంపదేశమని పేరువచ్చినది. ఈ దేశములోని మన్సబుదారులు కొండజాతివారి వలన యింటికి రూపాయిచొప్పున వసూలుచేయుచు దానిని జాగీరుగా అనుభవించుచుండిరి.

రంపలో 338 గ్రామములు, తోటపల్లిలో 103, జద్దంగిలో 88 గ్రామములున్నవి. ఈ రంపదేశమును 1800 వరకు నక్కాటి మన్సబుదారులు జాగీరుగా అనుభవించుచుండిరి. పూర్వపు రంపదేశపు కొండ

దొరల వంశీయులు కుంపినీవారికి అర్జీ యిచ్చుకొనగా 1813 లో మఱల దీనిని ఆ వంశీయుడైన రంపరామభూపతిగారి కిచ్చిరి. ఈ ప్రాంతములో ఇంగ్లీషు కుంపినీవారు మద్రాసు రాజధానిలోని సామాన్య ప్రభుత్వ పద్ధతివిగాక గవర్నరుకు స్పెషల్ ఏజెంటుగా గోదావరిజిల్లా కలెక్టరుద్వారా నిరంకుశ ప్రభుత్వ పద్ధతిని అమలు జరిగించుచుండిరి. దీనినిగూర్చి ఒక చట్టమునుచేసి కలెక్టరుకు సర్వాధికారము లిచ్చుచు గవర్నరుద్వారా కొన్ని ఉత్తరువులను జారీ చేయించిరి.

గోదావరి మన్యములలోని అరణ్యములందు నివసించు కోయలు తాము పాండుపుత్రుడైన భీమసేనుని సంతతివారమందురు. వీరు గోండు ఖోండు మొదలైన ఇతర ప్రాంతములలోని ఆటవికజాతికి చెందిన వారే. వీరు కొండదొరలమని చెప్పుదురు. వీరిలో కులములు లేవు. వీరు పరమేశ్వరుని పూజింతురు. నాగరికత సోకని వారు అబద్ధము లాడరు. వీరికి నీతినియమములున్నవి. గోదావరీ నదీతీరమునగల కొండలందు అడవులందు వీరు స్వేచ్ఛగా జీవించుచు అటవిక సంపద ననుభవించు చుండిరి.

అరణ్యములను కొండలను అనుకొని నాగరిక ప్రాంతములనంటి యున్నభాగములలోనికోయలు కొండజమీందారులకు లోబడియుండిరి. ఈ కొండజమీందారులు అటవికులతో సఖ్యతగానుండి నాగరిక ప్రాంతములందు కల్లోలము కలుగకుండా కాపాడుచు అటవిక జాతులనుండి అడవులలో నుత్పత్తియగు వస్తువులను నాగరిక ప్రపంచమునకు తెప్పించి యిచ్చుచుండుటవలన పూర్వమునుండియు నీదేశమునేలురాజులు వారినాదరించి తక్కువపేష్కషు నేర్పరచి, వారి నా ప్రాంతపు గ్రామముల నేలనిచ్చుచుండిరి. వారు పేష్కషు చెల్లించకపోయినను వీరేమియు చేయజాలకుండిరి. నిజమునకు మన్యపు దొరలు కొండజమీందారులును స్వతంత్రులుగానే యుండిరి. అనారోగ్యపు కొండలు అడవులుగల ఆ మన్య ప్రాంతములందు అధికారము స్థాపింపగల రాజులు అరుదుగా నుండిరి. ఇంగ్లీషు కుంపినీవారు నీ పద్ధతినే యవలంబించిరి. అయితే తాము నిర్ణయించిన స్వల్పపు పేష్కషు చెల్లించని కొండ జమీందారులను వద

చ్యుతులనుచేసి వారిని పట్టుకొని ఖైదుచేయుట, వారి జమీందారీలను తీసికొని ఇతరుల కమ్ముట, కొండజమీందారుల కుటుంబములలో వచ్చిన తగవులందు ఒకరి పక్షము వహించుట, మొదలైన పద్ధతులవలన నీ మన్యప్రాంతము లందలి జమీందారులు కుంపినీవారిపైన తరుచుగా తిరుగుబాటుచేయుట ప్రారంభించిరి. వారిపైకి కుంపినీవారు సైనిక దళములనంపినప్పుడు వారు అడవులలోనికి పారిపోయి ఆటవిక జాతి నాయకులదగ్గర తల దాచుకొనుచుండిరి.

ఇంగ్లీషువారు దక్కను సుబేదారుడైన నిజామాలీ నాశ్రయించి ఫ్రెంచివారిని త్రోసిరాజని 1767 లో ఉత్తరసర్కారులు చేజిక్కించుకొని అక్కడ తమ ప్రభుత్వమును స్థాపించినది మొదలు పోలవరము గూటాల కొత్తపల్లి నేలు మన్యపు జమీందారుల కుటుంబములందు కలహము పెంచి తమకు బాకీపడిన జమిందారులను తొలగించి క్రొత్త వారికి జమీందారీని కట్టబెట్టుటకు ప్రయత్నించుచుండిరి. సరిహద్దు మన్య ప్రాంతములద్వారా రంపదేశములోను ఇంకను దుర్గమారణ్యములలోను గల కోయవారిని లొంగదీసి ఆటవిక సంపదను చేజిక్కించుకొనుటకు విశ్వప్రయత్నములు చేయసాగిరి.

ఇంగ్లీషు కుంపినీదొరల కుట్రలఫలితముగా నీ మన్యముల నేలు రెడ్లకుటుంబములలో అంతఃకలహము పుట్టెను. 1785 - 1790 మధ్య పోలవరము, గూటాల జమీందారీ గ్రామములందును వాని పరిసరపు కొండలలోను తిరుగుబాటులు కలిగెను. 1785 లో కుంపినీవారు తమ సైనికదళమునంపి అక్కడి అల్లరుల నణచుటకు ప్రయత్నించిరి. గాని అక్కడ మరల తిరుగుబాటు జరిగెను. అంతట వారు మరల తమ సైనికులనంపిరి. గురగబల్లిదేసురెడ్డి గూటాలకు పదునైదు మైళ్ళ దూరములో నున్న నాగవరకోటలో నున్న కొండదొర. అతడు గూటాల పట్టుకొనగా కుంపినీవారి సైనికదళ మొకచిన్నయుద్ధము చేసెను. అప్పుడు కొంతమంది సిపాయిలు గాయపడి మరణించిరి.

1786- 1787 లో దేసురెడ్డి పక్షము వహించిన కొండజాతుల వారు తిరుగుబాటు చేసిరి, అంతట కుంపినీవారి సైనికులు మరల వచ్చి

కొండజాతివారిపైన తుపాకులు(పేల్చి వ్రాని వెనుకకు త్రిమ్మి. అయి నను జమీందారీ కుటుంబములలోని తగవు అంతముకాలేదు. కుంపినీ వారు అందులో కలుగచేసికొనిరి. కుంపినీవారి యనుగ్రహము వలన పోలవరము, గూటాల, కొత్తపల్లి యను మూడు ప్రాంతములకును జమీం దారుడైన మంగపతి దేవు 1790 లో కుంపినీవారికి పేష్కషు బాకీపడి నందువలన కుంపినీవారు బాధింపసాగిరి. వారతనిని పట్టుకొనిజమీందారీని ముక్కలుచేసి పంచదలచిరి. కుంపినీవారి రక్షణలోనున్న అతని సవతి తమ్ముడు, పారిపోయి కోయదొరల నాయకుడైన లింగారెడ్డి రాజ్యములో దాగికొనెను. ఆ రాజ్యము గోదావరికి తూర్పుఒడ్డున నుండెను. అదిపేరు నకు పోలవరమునకు లోబడినదే. దానిపైన సాలుకు 1500 లేక 2000 వర హాల ఆదాయము రాతగియుండెను. కాని లింగారెడ్డి సాలుకు 100 వర హాలు మాత్రము చెల్లించుచుండెను. అదియైనను అతని కిష్టమైనప్పుడే చెల్లించును. ఇటీవల చెల్లించుటయే మానివేసెను.

మంగపతి తమ్ముడు కుంపినీవారిపైన ఆ సమయమున తిరుగు బాటుచేసిన కలిదిండితిమ్మరాజుగారను జమీందారుతో చేరెను. వీరంద రును కలిసి పోలవరము జమీందారీలోని రెండు గ్రామములను కొల్లగొ ట్టిరి. అంతట క్రొత్త పితూరీ బయలుదేరెను.

ఈ పరిస్థితులలో మంగపతిదేవు మరల పూర్వమువలెనే నాట కమునాడుట ప్రారంభించి తాను కుంపినీవారి పాతబాకీ చెల్లించెదననిచెప్పి జమీందారీని వశము చేసికొనెను గాని చెల్లించలేదు. కుంపినీవారొక సైనికదళము నంపగా నొక చిన్నయుద్ధము జరిగెను. అందులో కుంపినీ వారి సిపాయిలు చాలామంది చచ్చిరి. మంగపతి పారిపోయెను. కుంపినీ వారు పోలవరములోని అతని కోటను నేలమట్టము చేసిరి. అతనిని పట్టియిచ్చిన వారికి పదివేల రూపాయలు బహుమతి నిచ్చెదమని ప్రకటిం చిరి. పోలవరము జమీందారీలో సైనికశాసనమును ప్రవేశపెట్టిరి. మంగపతి నిజాము రాజ్యములోనికి పారిపోయెను. ఈ ప్రాంతమంతయు అడవులతోను కొండలతోను నిండియున్నందువల్లను అనారోగ్య ప్రదేశ మైనందువల్లను కుంపినీవారిక్కడ శాంతిని స్థాపించుట గాని క్రమ

పరిపాలనము స్థాపించుటగాని సాధ్యముకాలేదు. చాలామందికి జబ్బులు చేయుచుండెను. కుంపిణీవారు క్రొత్తసైన్యమును తెచ్చి గణపవరములో నుంచిరి. 1800 ఆగష్టు 11 వ తేదీన కుంపిణీ అధికారులు కర్తవ్యమును నిర్ణయించుట కొరకు యుద్ధకార్యాలోచన సభను చేసిరి.

జమీందారు గోదావరిదాటి రంపరాజ్యములోనికి పోయినాడని వారనుకొనిరి. కుంపిణీవారి సైనికదళమొకటి దీరువారకు తరలిపోయెను. దాని రెట్టి యాటంకము నెవ్వరు కలిగించలేదు. అయితే పోలవరము నుండి బయలుదేరిన రెండవ దళమును మాత్రము లింగారెడ్డి మనుష్యులు అటకాయించిరి. అక్కడ జరిగిన సంకులసమరములో నొక సైనికాధి కారికిని ఒక సిపాయికిని గాయములు తగిలెను. అంతట కుంపిణీవారి సైనికదళము లింగారెడ్డిగారి గ్రామములను తగులబెట్టి నాశనముచేసిరి. కాని ఆయన మనుష్యులు వీరికి లొంగలేదు. మునిరెడ్డి అను నొక కొండదొరమాత్రము కుంపిణీవారి కలెక్టరుకు సహాయము చేసెను. లింగా రెడ్డిని లోబడవలసినదని వీరు కోరినను అతడట్లు చేయుటకు నిరాక రించెను. రంపప్రాంతపు ప్రజలను అణచియుంచుటకొరకు కుంపిణీవారు కొత్తపల్లిలోను ఇందిగపేటలోను ఒక్కొక సిపాయిలదళము నుంచిరి.

1800 ఆగష్టు 28 వ తేదీన కొండజాతివారు వచ్చి ఈ దళము లలో నొకదానిపైన పడిరి. 31 వ తేదీన పండుదొర యను నతడు మూడు నాలుగు వందలమంది ఆయుధపాణులైన కొండజనముతో పోల వరమున కెదురుగా నున్న పురుషోత్తమ పట్టణమునకు వచ్చి అక్కడ కుంపిణీవారి పడవలను పట్టుకొనెను. అతడు రాకపోక మార్గములను అరికట్టివేసెను. గోదావరినది కావల ప్రాంతములోని రంపదేశపు ప్రజలు కుంపిణీవారికి వ్యతిరేకులుగా నుండిరి. పోలవరములో వారి సైనికదళము లున్నప్పటికిని అక్కడవారికి వ్యతిరేకముగా కుట్రలు జరుగుచుండెను అందువలన ఇక్కడికి వచ్చిన కుంపిణీ సైన్యమును గంజాముకు పోవల సినదని గవర్నరు ఉత్తరువు చేసియున్నను మరి కొంతకాలమిక్కడ నున్నగాని మాటదక్కదని కలెక్టరుగారు బ్రతిమాలి యుంచిరి.

మంగపతిదేవు కుంపిణీవారితో రాయబారములు జరుపసాగెను. ఆయన సవతితమ్ముడు కుంపిణీవారికి లోబడెను. మూడవ సోదరుడైన రెడ్డి నరసింహదేవును కుంపిణీవారి సైనికులు పట్టుకొనిరి.

కుంపిణీవారి కలెక్టరు గ్రాన్‌ఫిల్ పోలవరము వెళ్లి 1210 ఫసలీకి 42698 వరహాల శిస్తును నిర్ణయించెను. ఈ జమీందారీని ఆకుటుంబములో నింకొక దూరపు బంధువుడైన లక్ష్మీనారాయణదేవుకిచ్చి అతనిని తమకు లోబరచుకొనెను*

ఇది జరిగిన తరువాత కొంతకాలము జరుగగానే మఠల సీమన్యములలో పితూరీలు ప్రారంభమయ్యెను. దీనిని గూర్చి విచారించుటకై మద్రాసు గవర్నరుగా నుండిన సర్ తామస్ మన్రోగారు 1822 లో ఉత్తర సర్కారులలో పర్యటనము చేసి 1823 జనవరిలో నొక మినిటును వ్రాసిరి.

* Godavari District Manual; Henry Morris pp 268-275

# 8. గంజాము విశాఖపట్నము ఏజెన్సీలు

గంజాము విశాఖపట్టణము జిల్లాలలో భూమిశిస్తుల శాశ్వత పరిష్కారము జరిగించుటవలన శాశ్వతముగా ప్రభుత్వాధికారములను వదలిపెట్టుటగా పరిణమించినదని తేకరీగారు వ్రాసిరి. *జమీందారులకు పోలీసు అధికారములు లేకుండాచేసి ద్రవ్యాకర్షణచేయు వ్యవహారమును వారికి మనము విడిచిపెట్టినాము గనుక దేశముమీద హక్కులు కలుగుటకు కావలసిన ముఖ్యాధారమును శాశ్వతముగా వారికిచ్చివేయుట జరిగినది. ఈ జిల్లాలలో నుండెడి చీఫులు లేక జమీందారులను పూర్వపు దొరతనమువారు కేవలము శిస్తులు వసూలుచేయు జమీందారులుగా నెంచక అవసరము వచ్చినప్పుడు యుద్ధములలో సహాయము చేయునట్టివారిగా నెంచిరి. వీరు కొండజనమును అదుపులో నుంచుదురని వారి యుద్దేశము. అందువలన స్వల్పపు పేష్కషుమాత్రమే నిర్ణయమై వీరుచెల్లించుచుండిరి.

వెల్లస్లీగారు గవర్నరు జనరలుగా నుండగా ఈ ప్రాంతములలో ఇంగ్లీషు కుంపినీవారి చీఫులు వారి కార్యాలోచన సభలు జరిపించిన పరిపాలనము అధ్వాన్నముగా నుండెను. వారు తెలుగు దుబాసీలపైన నౌకరులపైన ఆధారపడియుండిరి. ద్రవ్యాపహరణము చేసిన దుర్మార్గుల కృత్రిమమును కప్పిపుచ్చుట కనేక రహస్యపు పద్ధతులు జరుగుచుండెను.

రాజ బిరుదులు వహించిన జమీందారులు విశేషముగా లంచము లిచ్చుచుండినందున వారికందరు స్నేహితులైరి. పోలీసు వ్యవహారము

* విశాఖపట్టణము జిల్లా మాన్యూయలు-కార్మికేలు ౪౦౪.
(15-2-1810 తేదీన గంజామునుగూర్చి వ్రాయబడిన మినిటు)

లను పరిష్కరించుటకు చీఫ్ ఇన్‌కవున్సిలు వారెన్నడును పూనుకొన లేదు. అట్టి వ్యవహారములను బహు అరుదుగా విచారించుచుండిరి. ఎప్పుడైనను కంపెనీవారి నేతగాండ్రకు ఇతర దొరల నేతగాండ్రకు సంబంధించిన వ్యవహారములలో మాత్రము వారు న్యాయపరిశీలన చేయుచుండిరి. రెవిన్యూ వ్యవహారములలో నిప్పటికంటె అప్పుడు విశేష పరిశీలన చేసియుండలేదు. అని రేకరీగారు వ్రాసిరి.

ఈ పూర్వ వంశీయ జమీందారుల గుణదోషములను గూర్చికూడా విచారణ జరుగలేదు. అందువలన అంతయనాగరికముగాను బలవంతులుగాను ఉన్న సామంతు రిప్పటి కొత్తపద్ధతుల ననుసరించి సంచరింతురనుకొనుట శక్యముకాదు.

ఈరాజులు సోమరులుగను అజ్ఞానులుగను పిచ్చి మతపట్టుదల కలవారుగాను వ్యవసాయ శీలురుగను దుర్దయ స్వభావులుగను దాంభికులుగను. కుంపినీ సర్కారువారి యుద్యోగులపట్ల అనుమానము కలవారుగను ఉన్నారు. వారు సర్కారుకు పన్ను చెల్లించు సామాన్యప్రజల వంటివారము కామని యనుకొనిరి. ఇట్టివారికి యెటువంటి హాని కలిగించినను వారిపట్ల కుట్ర చేసినను అవమానము చేసినను విశేష ప్రమాదములు కలుగుటకు కారణమగును. వారికి భయము అనుమానము ఆగ్రహము కలిగినచో వారెంతటి సాహసమునైన చేయుదురు. అటువంటి సాహసములు జరుగుటకు తావియ్యకుండా సర్కారువారు నివారింపవలెను.

ఈ జమీందారులు నిజమునకు జయింపబడినవారుకారు. ఈజిల్లాలో మనయధికారము సర్వదా బలహీనముగాను కశ్మలముగాను ఉండెడిది. ఈ రాజులద్వారా మనమీదేశమును పరిపాలించి యుంటిమి. ఇప్పుడు 1802 నాటిశాశ్వత పరిష్కారమును బట్టి వారిని సత్కారములేకుండా మనము నిరాకరించినాము. సర్కారుకొక వాయిదా పైకము బాకీయున్నను వారియెస్టేటులు జప్తు చేయబడుచుండును. సొమ్ము చెల్లింపనిచో వేలము

* Ibid. p. 405

చేయబడును. పూర్వపు పోలీసుపద్ధతికి బదులుగా ప్రస్తుతము కొత్తపోలీసు ఉద్యోగులు నియమింపబడి యున్నారు. క్రొత్తగా సివిలుక్రిమినలు అధి కారుల నేర్పరచడమైనది. ఈ పద్ధతులు క్రొత్తవిగాను తికమకలుగాను ఉన్నవి. పూర్వపు సత్యకాలపు దినములలో కలుగని యనేక ఇబ్బంది లకు విసుగుదలలకు నివి కారణమైనవి.

పూర్వము కలెక్టరుకు డిస్ట్రిక్టు మేజిస్ట్రేటు అధికారములేదు. జిల్లా జడ్జి కా యధికారముండెను. ఆయన స్థిరముగా నొకచోట నుండును. ఆయనక్రింది దారోగాలు బంట్రోతులు చేయు పనులకు పైతనిఖీ లేకుండెను. అందువలన ప్రజలవలన సొమ్ములాగి ప్రజలను పీడించుట తప్ప వారుచేయు పనిలేదు. జమీందారులు వారికి అలుసుగానుండిరి. వారు చేయు చిన్న తప్పిదములను గోరంతలుకొండంతలుచేసి లాభముపొందుట గొప్ప వ్యాపారముగనుండెను. కొత్వాళ్ళు బర్తతరపు కాబడిన రైటరులు దుబాషులు, బట్లర్లు, కొట్లలోను కచ్చేరీలలోను ఎందుకును పనికిరారని తీసివేయబడినవారు దారోగా పనులకు కుదురుచుండిరని తేకరీదొరవారు వ్రాసిరి. వారి బంట్రోతులెందుకును పనికిరానివారు. భత్యమునకు కుదిరిన జవానులు కచేరీలలో కనిపెట్టుకొనియుండు "బేరోజు"(బేవారసు దళారీ) మనుష్యులుసీ దుబాషుల నాశ్రయించుచుండెడివారు. వారు వారిబంట్రో తులుగా నుండిరి. అటువంటి జవానులను జమీందారీలలోనికి పంపించు టవలన చాలా అనర్థములు కలిగెను. పూర్వపుపద్ధతి చెల్లుబాటుగా నుండిన రోజుల్లో జమీందారు లెటువంటి ఘోరములు జరుగుచుండినను జిల్లాజడ్జిగారిక్రింద కొత్తగా నేర్పరచిన పోలీసు పద్ధతివలన నంతకన్నను అధికమైన ఘోరకృత్యములు జరుగుచుండెను.

ఈ దారోగాలు జరిగించిన హింసలవలనను కొత్తగా ప్రవేశపెట్టిన రెవిన్యూ జుడీషియలు చట్టములను అమలుచేయుటవలనను విసిగి, శాశ్వత పరిష్కారము జరిగిన పిమ్మట చాలా సంవత్సరములవరకు జమీందారు లసంతృప్తి చెంది అసంతుష్టితో నుండిరి. ఇందుకు తోడుగా

దురదృష్టవశముచేత వారెంత మానసంతులో అంతరి క్తతకూడాకలవారై యుండిరి.

1794 వ సంవత్సరములో విజయరామ రాజుగారు చనిపోయిన తరువాత ఆయన కుమారునియొక్క అధికారమును తగ్గించుట కుంపినీ వారి కావశ్యకతగా కనబడెను. అందుకొఱకు లోగడ సీతారామరాజు గారివలన పదభ్రష్టులుగా చేయబడిన కొంత జమీందారుల వారసులకు వారి పూర్వస్థితులను తిరిగి యొసగబడెను. ఆస్తిగాని వసవతిగాని లేకుండా వారు తమతమ జమీందారీసలమునకు వెళ్ళిరి. వీరిలో చాలా మందికి శాస్త్రీయమైన సోదరుడో లేక పితృవ్యపుత్రుడో యుండి జమీం దారీ సొత్తు తనదేయని వివాదముచేయుచు కొందఱు కొంతజనమును కూర్చుకొని పోయి జమీందారీయొక్క కొంతభాగము నాక్రమించి ముష్కరముగా ననుభవించుట జరుగసాగెను.

ఇంగ్లీషు కుంపినీ సర్కారువారు సైన్యమును కూర్చి యిటువంటి ముష్కరజనులను శిక్షించుటకు వారి స్థలములలోనుండి వారిని వెడల గొట్టుటకును మొదట కొంత ప్రయత్నము చేసిరి గాని అట్లు సేననంపి నప్పుడు కొన్ని పర్యాయములు జయము కలుగుటయు కొన్నిపర్యాయ ములు అపజయము కలుగుటయు సంభవించినది. ఒక పద్ధతిగాను బలముగాను నడిపింపకపోవుట వలన అధికారి లనుకున్న దానికన్న ఎక్కువ తరుచుగా పితూరీలు కలుగుచుండెను. సర్కారుకు ధనము జనము ఎక్కువగా నష్టము కలుగుచుండెను. అట్టి సమయములలో పితూరీదారులతో రాజీనామా వచుటకు రాయబారములు జరుపుటయు అందువలన వారు మూర్ఖము వహించుటయు తటస్థించినది. క్రొత్తగా మొనగాండ్రు బయలుదేరి సర్వత్ర బందిపోటులు జరుపసాగిరి. కుంపినీ వారవలంబించిన పద్ధతివలన తమపైన చర్య జరుపరను నమ్మకముతో జమీందారులు తాము చెల్లించవలసిన కిస్తీలు చెల్లించక మానిసేసిరి.

1832 వ సంవత్సరము వసూప్తికాలమునందు విశాఖపట్టణము జిల్లాలోను గంజాము జిల్లాలోని పర్లాకిమిడి జమీందారీలోను కొంత

జమీందారుల పితూరీలు విస్తరించెను. వానిని అణచుటకు కుంపినీ సర్కారువారు విశేషసైన్యమును పంపించవలసి వచ్చెను. ఈ పితూరీలు పుట్టుటకు గల ముఖ్యకారణములను విచారించి స్పష్టముగా తెలియ చేయుటకును వానిని నివారించుటకు సాధనముల నాలోచించి, పితూరీలను అణచుటకును ఇకముందిట్టి పితూరీలు కలుగకుండా నివారణోపాయములను సూచించుటకును అప్పట్లో రెవిన్యూబోర్డు మొదటి మెంబరుగా నుండిన జార్జి రసెల్ దొరగారిని 1832 డిశంబరు నెలలో స్పెషల్ కమిషనరుగా నియమించి ఆయనకు అసాధారణములైన విశేషాధికారముల నొసగిరి. పితూరీలు జరుగుచున్న తాలూకాలలో "మార్షల్‌లా" అను సైనికశాసన విధులప్రకారము హద్దుమీరిన వారి నురిదీయుటకు కూడా ఆయన కధికారమివ్వబడినట్లు ప్రకటింపబడెను.

ఆదివరలో విశాఖపట్టణము జిల్లాలో జరిగిన పితూరీలకు ముఖీ వీరభద్రరాజు. కాకర్లపూడి జగన్నాథరాజు అని పిలువబడు పాయకరావుగారును ముఖ్యకారకులైనట్లు రసెల్ దొరగారికి కనబడెను. వీరిలో మొదటివారు కాశీపురము జమీందారీనుండి తొలగింపబడిన ముఖీరాజగోపాల రాజుగారి కుమారుడు. 1793 లో విజయనగరము రాజాగారినుండి జమీందారీని తప్పించిన పిమ్మట రాజగోపాల రాజుగారు కల్లోలము కలిగించెను. మరుసటి సంవత్సరము విజయనగరము రాజుగారు కుంపినీవారిపైన పద్మనాభయుద్ధము చేసిఓడిపోయిన పిమ్మట నీ రాజగోపాలరాజుగారు వారి కుటుంబమువారికి సహాయము చేసెను. ఇటీవల వీరభద్రరాజుగారును విజయనగరపు చిన్నరాజాగారిని తమ సంరక్షణలో నుంచుకొనిరి. విజయనగరపు రాజావారు సంస్థానమును కుంపినీవారికి వప్పగించి కాశీకి వెళ్ళిరి. జమీందారైన వీరభద్రరాజుగారిని పట్టుకొన్నవారికి 5000 రూపాయిలు బహుమతి నిచ్చెదమని కుంపినీవారు ప్రకటించిరి. రెండవవారైన పాయకరావుగారు పూర్వము విజయనగర రాజాగారి సరదారుగా నుండిరి. వారికి చాలా ద్రవ్యము బాకీపడి చనిపోవగా నీయన తాలూకు అనకాపల్లి జమీందారీని విజయనగర

ములో కలిపివేసిరి. ఆయన భార్యలకు సాలుకు వెయ్యిరూపాయిల భరణము నిచ్చుటకు కుంపినీ ఒప్పుగా ఉత్తర్వు చేసిరి. పద్మనాభ యుద్ధము జరిగిన తరువాత విజయనగరము జమీందారీని తగ్గించి అనకాపల్లి మొదలైన తాలూకాలను కుంపినీవారి హవేలీ ఖండములో కలిపివేసిరి. శాశ్వత పరిష్కారకాలమందు ఆ దేశమును విజయనగరము రాజాగారు కుంపినీ వారి వేలములోకాని దానిని గోడే జగ్గప్పగారి కుమారుడైన ప్రకాశరావు గారికి తిరిగి విక్రయించిరి. పూర్వపు అనకాపల్లి రెండవ రాణిగారు 1814 లో చనిపోవగా ఆమె దత్తపుత్రుడని యొకడు బయలుదేరెను. కాని అతని దత్తతయొక్క నిజానిజములు చూచి తెలియవని కుంపినీ వారు భరణములు నిలిపివేసిరి. అతడూరకొనెను గాని అతడు చనిపోవగానొకజ్ఞాతి పాయకరావు అని పేరు పెట్టుకొని విస్తారమైన ఆయుధ జనులతో బయలుదేరి దేశములో పితూరీచేయుచు దోచుకొనసాగెను. ఈ జిల్లాలో నైఋతిభాగమునందీయనయు మధ్యఖండమున వీరభద్ర రాజుగారును పితూరీలు చేయసాగిరి. ఈ పితూరీలమొదలు చూచి క్రొత్త ప్రొప్రయిటర్లు బయలుదేరినదో వారికి సహాయముచేయుట గాని వారి తాలూకాలను వారి స్వంతయుద్యోగులద్వారా వ్యవహరించుటకు గాని శక్తిచాలక, బాకీయున్న పేష్కషు పైకముక్రింద తాలూకాలను వేలము వేయించకుండా కుంపినీ సర్కారువారు ఉపేక్షించుచున్నారని చాలామందికి ధైర్యముకలిగి సర్కారుకు చెల్లింపవలసిన కిస్తీలను ఎగబెట్టి సొమ్మును తమ విలాసములక్రింద వినియోగించుకొనసాగిరి.

ఈ పితూరీలకు పాలకొండ ముఖ్యస్థానమై యుండెను. పూర్వము పాలకొండ జమీందారు నరేంద్రరావుగారు సర్కారుపైన తిరుగుబాటు చేయగా ఆయనను తప్పించి 1796లో పాలకొండ తాలూకాను సీతారామ రాజుగారి కిచ్చిరి. ఆయన 1798 లో చనిపోయెను. ఆయన కనిష్ఠసోదరుడైన వెంకటపతిరాజుగారు ఆ తాలూకాపైన రూ 5600 చెల్లించునట్లు శాశ్వతపైసలా జరిగెను. ఈ సమయమున పూర్వము తిరుగుబాటుచేసిన ఈయనగారి తండ్రి నరేంద్రరావుగారు తానే జమీందారుడనని పేరుపెట్టు

కాని విశేషముగా ఆయుధజనమును కూర్చుకొని తాలూకాలోని రెండవ పట్టణమున జీవించుచు శాంతికి భంగము కలిగింపసాగెను. కుంపినీ సర్కారువారు పెద్ద సైన్యమును పంపి ఆయనను వెళ్ళగొట్టిరి. అటు పిమ్మట వెంకటపతిరాజుగారికి దుర్బుద్ధి కలిగి సొమ్ము దుర్వ్యయము చేయుచు కుంపినీ కిస్తీ చెల్లించకపోవగా కలెక్టరుగా రాయన తాలూకాను జప్తుచేసెను. ఆయన దివాను జామీనునిచ్చి విడుదల చేయించిరి. ఇట్టి స్థితిలో జమీందారుకు దివానుకు 1827-28 మధ్య కలతలు కలిగెను. దివానుగారిని ఇంకొకరిని జమీందారుగారింటిదగ్గర చంపివేసిరి. ఈజమీందారు నివసించియున్న ప్రదేశము జనుల కగమ్యమైనది. జాడ్యప్రదమైనది. క్రూరజనులు వసించునట్టిది. అందువలన తన క్రిందనున్న నలుగురు జవానులు కోనకొండకుపోయి జమీందారును పట్టుకొనుట సాధ్యము కాదని మేజస్ట్రీటు రిపోర్టుపంపెను. ఇట్టి స్థితిలో 1830 లో వెంకటపతి రాజుగారు చనిపోయెను. ఆయన కుమారుడైన కూర్మరాజు చిన్నవాడు. ఆయన సవతితల్లులలో నొకామెను ఎస్టేటు మేనేజరుగా నియమించిరి. అక్కడికొండదొరలు మొఖాసాదారులు ఒక్కొకరాణిపక్షమువహించి అల్లరులుసాగించి కుంపినీవారికి శిస్తులు చెల్లించకుండా తాము లాభముపొందుటకు కుట్రలుచేసిరి. 1833లో జమీందారుకు యుక్తవయస్సు వచ్చినప్పటికొక లక్ష రూపాయల బాకీ తేలెను. అందులో మైనరురాజాకోర్టు అఫ్ వార్డ్సువారి వశమున నున్న కాలమున చెల్లవలసినదానిలో మూడవవంతు వదలి మిగిలిన దానికి జమీను పుచ్చుకొని జమీందారీని వప్పగించుటకు కుంపినీవారు కలెక్టరుగారికి ఉత్తరువుచేసిరి. ఉపద్రవస్వభావము గల పితూరీలు జమీందారీలో జరిగినవనియు ఇంకను కొంతకాలము తాలూకాను కోర్టుఆఫ్ వార్డ్సుమేనేజిమెంటు క్రింద నుంచుట యావశ్యకమనియు కలెక్టరుగారు 1832 ఆగష్టు నెలలో రిపోర్టుచేసిరి. పితూరీలవలన చాలా కష్టములు కలిగెను. ఒకదినము పట్టపగలు జారీజలోనున్న సిబ్బందిపైన నొకజట్టు పితూరీదారులు మోహరించి ఇద్దరు సిపాయిలను చంపి ఏడుగురికి గాయములు చేసి ఊరు దోచుకొని పదిళుపాకులెత్తుకొని పోయిరి.

ఇంతలో రస్సెల్‌దొరగారు స్పెషల్ కమీషనరుగా వచ్చిరి. 1833వ సంవత్సరము జనవరిలోగా అనగా రస్సెల్‌దొరగారు వచ్చిన కొద్దిరోజులైన తరువాత నీ పితూరీదారులు మునపటికన్న విశేష దౌర్జన్యములను చేయుట ప్రారంభించిరి. పాలకొండ అమీను ఆఫీసులో అంక్షి చేయబడి యున్న ఒక పేరుపొందిన నేరగానిని విడిపించుటకొరకు కచేరీమీదికి ఒక జట్టువెళ్ళి ముట్టడించిరిగాని కార్యము ఫలించలేదు. అందువలన అదివరకు సర్కారు అధికారులవలన ఖయిదుచేయబడి యున్న నేరగాండ్రను విడిపించుటకు గొప్ప సన్నాహము నాలోచించిరి. పాలకొండ సమీపమున నున్న అప్పుపలసలోని పుష్కారులందరును సమావేశమై యుండగా వారు చేయదలచిన దుర్మార్గమును తెలిసికొని దానిని విఫలము చేయుట జరిగెను.

వారిట్లు చేయదలచినంత అల్లరిచేసి కోటలోనుండి పారిపోయిరి. కంపెనీవారా కోటను పరిశీలింపగా పితూరీదారులలో ముఖ్యులపేర జమీందారుగారును ఆయన తమ్ముడును ఇంక నా కుటుంబములోని వారును వ్రాసిన ఉత్తరములొకట్టు దొరికెను. వీనిని చదివినపిమ్మట కమీషనరుగారు కొందరు సిపాయిలను పాలకొండకు పంపించి అక్కడివారు తిరుగుబాటు చేయకముందే వారియిండ్లు నాక్రమించి నెమ్మదిగా అందరిని పట్టుకొనిరి. 'మార్షలా' అను సైనిక శాసనము నదివరకే ప్రకటింపబడి యుండినందున రస్సెలుగారికి నేరగాండ్రుగా కనబడిన యారుగురు సర్దారులను మిలిటరీ కోర్టువారి యెదుట విచారణచేసిరి. చనిపోయిన జమీందారుగారి తండ్రి భార్యయగు జగ్గయ్యమ్మనుగూర్చి రస్సెల్‌గారు చేసిన యుక్తులపులు ఆ విచారణ పూర్తికాక మునుపే కంపెనీ సర్కారువారంపిన ఉత్తరువులవలన రద్దుపరుపబడి ఆమెను స్టేటు ప్రిజనరు లేక రాజఖైదీగా నుంచిరి. తక్కినవారందరును దోషులగా నెంచబడి వారికి మరణదండన శిక్ష విధించిరి. దివానును మఱియొక మనుష్యుని బహిరంగముగా ఉరిదీసిరి. జమీందారును ఆయన కుటుంబమువారిని రాజఖైదీలుగా రాయవేలూరు కంపిరి. జమీందారీని కంపెనీ సర్కారులో కలిపివేసిరి.

[illegible]కొండపితూరీ అణచివేయబడిన కాలముననే అనగా 1833లో [illegible] వీరభద్రరాజుగారిని కుంఫిసీ సర్కారు సైన్యము పట్టుకొనెను. [illegible] అయన పరివార జనమును నిజామురాజ్యములోనికి పారి [illegible]. 1834వ సంవత్సరము మే నెలలో చాలా జనముతో ఆయన [illegible] వచ్చెను. మిలిటరీ సైనికుల యొత్తిడిచేత గోలుగొండ పర్వతము [illegible] వెనుకగా నున్న రాజమహేంద్రవరము జిల్లాలోని రంపకొండల లోనికి ఆయన పారిపోయెను. పిమ్మట రంప జమీందారుగా రాయనను పట్టుకొని కుంఫిసీవారి కప్పగించగా అనకాపల్లిదగ్గర ఆయన నురిదీసిరి.

రస్సెలుగారు ఈ పితూరీలను గూర్చి 1833 నవంబరు 18వ తేదీన ఒక నివేదికను పంపిరి. ఆ మరుసటి వత్సరము మద్రాసు గవర్నరైన ఆడముగారు సర్కారు జిల్లాలను తనిఖీచేయుటకు వచ్చిరి. తక్కిన కుంపిసీవారి రాజ్యములోని జిల్లాలలో అమలు జరుగుచున్న పరిపాలనా విధానమును శాసన విధులును ఈ కొండప్రాంతములకును కొండ జమీందారులకును తగవనియు గవర్నరుగారు జారీచేయు ప్రత్యేక ఉత్తరువుల క్రింద కలెక్టరుయొక్క నిరంకుశ పరిపాలనా విధానమును ప్రవేశపెట్టుట అవసరమనియు రస్సెలుగారి సూచనను అడముగారా మోదించి 1835 లో మినిట్సు వ్రాసిరి.

వీరు చెప్పిన సంగతులు నిజములని త్వరలోనే రుజువయ్యెను గుమునూరులో పితూరీ జరిగెను. దీనినిగూర్చి 1836ఆగస్టు 12వ తేదీనను 1837 మే 11 వ తేదీనను రస్సెల్‌దొరగారు రిపోర్టులు వ్రాసిరి. కుంపిసీ వారు సర్వాధికారులని తెలిసికొనియున్న ప్రదేశములలో అమలు జరుగుచున్న ప్రభుత్వ విధానమును శాసనవిధులు నీ ప్రాంతములకు వర్తింపచేయుట పిచ్చిపనియనియు, కడచిన ముప్పది సంవత్సరము లో నీ ప్రాంతములందు కుంపిసీవారు పోలీసు అధికారులనైన నేర్పరచి యుండలేదనియు, కుంఫిసీవారు దేశమున కధికారు లనుసంగతి ఈ ప్రాంతమువారికి తెలియనే తెలియదనియు గంజాము విశాఖపట్టణము

* విశాఖపట్టణము జిల్లా మాన్యూలు పుటలు ౪౧౦-౪౧౨.

కొండ ప్రదేశములకొక స్పెషల్ కమిషనరు నేర్పరచుటకు కుంపిణీ వారాలోచించిరి. ఇదికూడా సరియైన పద్ధతికాదని ఆయనకు తోచెను. నాటు ప్రదేశముల పైన అధికారము స్థాపించనిచో వాని నానుకొని యున్న కొండప్రదేశముల పైన అధికారము వహించుట చాలా కష్ట సాధ్యమైన కార్యమని ఆయన చెప్పిరి. ఈ కొండ ప్రాంతములలో పితూరీలు కలిగినప్పుడు సైన్యము, పరివారము, ఆయుధసామగ్రి సరంజాము అంతయు ప్రక్కనున్న ప్రాంతములనుండి రావలసియుండును. దిగువదేశపు కలెక్టరులకు కావలసిన పనులనుగూర్చి యాజ్ఞాపించుటకు కమిషనరు కధికారమియ్యవలసి యుండును. ఆయనకు కలెక్టరులు కొన్ని విషయములలో తాబేదారులుగాను కొన్ని విషయములలో వారికి లోబడని స్వతంత్రాధికారులు గాను ప్రవర్తింపవలసి వచ్చును ఇందువలన సర్కారు కార్యములను నిర్వహించుటకు అత్యంతావశ్యకమైన అనుకూల్యము, సమరసత కలుగనేరవు. కాబట్టి కొండజమీందారులను సామాన్య సివిలుక్రిమినలు కోర్టుల యధికారమునుండి తప్పించి వీరి పైన సివిలుక్రిమినలు న్యాయవిచారణాధికారములు కలెక్టరులకే కలిగించి కొండజమీందారులను కలెక్టరులయధికారమునకు లోబడచినచో కలెక్టరుల అధికారము దర్పమును వెల్లడియగును. కొండ జమీందారుల బాధలను నివారించుటకును వారిని అదుపులోనుంచుటకును వీలుకలుగునని రస్సెల్‌గారు తెలియచేసిరి. అంతట 1839 వ సంవత్సరములో 24 వ నెంబరు చట్టమును శాసించి ఈ సూచనల నమలుచేసిరి (విశాఖపట్టణము జిల్లామాన్యువలు పుటలు [illegible]).

జయపురపు జమీందారుగారైన విక్రమదేవుగారు అసమర్థులుగానున్నారనియు ఆయనక్రింది [illegible] అక్రమములు అన్యాయములు జరిగించుచు ప్రజలను పీడించుచున్నారనియు 1848 సంవత్సరములో చాలా ఫిర్యాదులువచ్చినవి. రైతులు విశాఖపట్టణమునకు వచ్చి దేశమంతట నరహత్యలు దొంగతనములు బలవదాక్రమణములు జరుగుచున్నట్లు తెలియచేసిరి. తుదకురాజాగారి యుద్యోగులను జయపురము తాలూకానుండి తరిమివేయుటతో పితూరీలు పుట్టెను. జయపురము జమీందారుగారి

కుటుంబములో నేకలతలు పుట్టెను. ఆజమీందారీలో కలెక్టరుగారి అధికారము ధిక్కరించిరి.

రివిన్యూ మేనేజిమెంటు మాత్రమేగాక దేశములో శాంతి భద్రతలు కాపాడుటకొఱకు పోలీసుఫౌజు నుంచుట కుంపినీవారి విధియని కలెక్టరుస్మాలెట్టుగారు సూచించెను. 1855-56 సంవత్సరములలోకూడా జయపురములో పితూరీలు జరిగెను. కుంపినీవారి పోలీసుఫౌజు సక్రమముగ నుంచుట రాజాగారి సంస్థానాదాయము కిష్టముగ లేదు. అందువలన కుట్రలు జరుగుచుండెను.

ఈ కొండ జమీందారీలలో ఎనుబదేండ్ల నుండి అరాజకము వర్ధిల్లుచుండగా కుంపినీవారు తమ సైనికబలమును గాని ఇతర ఫౌజును గాని తెచ్చి ప్రజలలో భయభక్తులు కలిగించకుండా సామాన్య పరిపాలనా పద్ధతులను అమలుజరుపుటకు ప్రయత్నించినందువలననే ఈ పితూరీలు వర్ధిల్లెను.

జయపురము రాజాగారికి గాని ఆయన సరదార్లకుగాని ప్రాపీనాధికారములు లేశమైనను లేవు. కటకమునకు లోనైయున్న మహాళ్లలో (అనగా కటకమునకు పన్నుకట్టెడు తాలూకాలలోను) బంగాళమునకు నైఋతి సరిహద్దునగల అడవి తాలూకాలలోను మన కంటకంటె సమీపమున నున్నట్టియు జయపురములో కలిసి వ్యాపించియున్నట్టియు "సెంట్రల్ ప్రావిన్సెస్" మధ్యరాష్ట్రములలో నున్న జమీందారీలలోను కేవలము భిన్నమగు పద్ధతి యవలంబింపబడుచు నుండెను.

ఈ జయపురము మన్యములను తనిఖీచేయుటకు వెళ్ళిన ఇంగ్లీషు కుంపినీ యుద్యోగులందరికిని విశేష రోగబాధ కలిగినది. వారు చాలా ఇబ్బందిపడిరి. అధునాతన పరిపాలనా పద్ధతులను జరుగు ప్రాంతములకు దూరముగా నున్న ప్రదేశములందు కలుగు ప్రమాదములను వారనుభవించిరి.



# 9. 1857 నాటి పితూరీలు

ఉత్తర హిందుస్థానమునుండి మహారాష్ట్ర గోసాయీలును వాహాబీ ఫకీరులును 1857 లో దక్షిణ భారతదేశమునకు వచ్చి మొగలాయి చక్రవర్తియు మహారాష్ట్ర పీష్వాయు తిరిగి నిజమైన దేశనాయకులు నేకమై భారతదేశము నాక్రమించి దుష్పరిపాలనము చేయుచున్న యీ ఇంగ్లీషు వారిని తరిమివేయుటకు యుద్ధము చేయుచున్నారనియు ఇక్కడివారు కూడా తిరుగుబాటుచేసినచో ఈ పరంగివారిని సముద్రములో వెళ్ళగొట్టవచ్చు ననియు చెప్పుచు ప్రచారము చేయసాగిరి. అయినను ఈ నాటి ప్రాంతముల హిందువులెవరు కదలలేదు. అదివరకు మరాటీ దండులని మనవారు పేరుపెట్టిన పిండారీ దండులు వచ్చి గ్రామములు తగులబెట్టి స్త్రీలను చెరపట్టి ప్రజలను హింసించి రాక్షస కృత్యములు చేసిన సంగతి యీ ప్రజలింకను మరచిపోలేదు. ఇంగ్లీషుప్రభుత్వము స్థాపింపబడినాటికి దేశము నేలుచుండిన మహమ్మదీయ ఫౌజుదారులు నవాబులు చేయుచుండిన దుష్పరిపాలనమును అన్యాయములను వీరు మరువలేదు. అయితే మహమ్మదీయులలో మాత్రము కొంత సంచలనము కలిగినది. ఆ సంవత్సరము మొహరము పండుగ ఆగస్టు నెలలో వచ్చినది. ఉత్తర హిందుస్థానమున ఢిల్లీ నగరము సిపాయిపిత్తూరీదారులచేతులలో నుండెను. ఇంగ్లీషువారి రాజ్య మంతరించినదను వార్తలు వ్యాపించుచుండెను. అందువలన నిక్కడ కొంత అల్లరి జరుగునని జిల్లా కలెక్టరులు తలచిరి కాని ఎట్టి తిరుగుబాటుగాని అల్లరులుగాని జరుగలేదు.

గోదావరి జిల్లాలో అప్పటి యర్నగూడెము తాడిమళ్ళ తాలూకా లలో నుత్తరపున కొండల ప్రాంతములోని మన్యమునందు మాత్రమొక చిన్న తిరుగుబాటు జరిగెను. కొరటూరుగ్రామ మునసబు కోరుకొండ సుబ్బారెడ్డిగారి కుమారుడొక ధనవంతురాలైన వితంతువును వివాహ మాడదలచెను. అయితే ఆమెను బుట్టాయగూడెము గ్రామమునసబు దగ్గరకు తీసియుంచెను. అంతట సుబ్బారెడ్డిగారి హరిజనులు కోయజాతి వారు ఆ స్త్రీని బలవంతముగా యెత్తుకొనిపోవుటకు ప్రయత్నించిరి. గాని ఆమె దొరకలేదు. వారికప్పుడు ఆగ్రహముకలిగి ఆమెభర్త యూరు దోచుకొనిరి. ఈ సంగతివిని హెడ్ అసిస్టెంటు మేజిస్ట్రేటు 60 లేక 70 మంది పోలీసు జవానులతో బయలుదేరి అల్లరి జరిగినచోటికి వెళ్ళి దోపిడి ఆస్తితోసహా కొందరు నేరస్థులను పట్టుకొని బుట్టాయగూడెమునకు తిరిగివచ్చెను. అప్పుడు సుబ్బారెడ్డిగారిక్రింద కొండజాతివారు విల్లు నమ్ములతోను తుపాకులతోను వచ్చి వీరిని ముట్టడించిరి. మేజిస్ట్రేటుకు తగిన సిబ్బంది లేనందువలన ఖైదీలను వదలివేసెను.

ఆటుతరువాత గోదావరిజిల్లా కలెక్టరుగారు ధవళేశ్వరములో నున్న కెప్టానురోడ్‌క్రింద రెండు కంపెనీల శాపర్సు అండ్ మైనర్సు అను సైనికదళ భాగములతో బయలుదేరి తిరుగుబాటువారలు నాగవరము కోటలో దాగుకొన్నట్లు విని అక్కడికి పోయెను. అయితే వారు రహస్యమార్గములద్వారా పలాయనమైరి. అంతట సిపాయిలు వారిని తరుముకొనిపోవుచు జీలుగుమిల్లి దగ్గర నొక కొండ నెక్కుచుండగా తిరుగుబాటువారలు కొండ ఎగువనుండి క్రిందికి తుపాకులు కాల్చుట ప్రారంభించిరి. కొండకు రెండుప్రక్కలను అడవులుండెను. సిపాయిలు చుట్టుదిరిగి గ్రామములోనికి వెళ్ళగా తిరుగుబాటువారలు వీరిపైన బాణములవర్షము కురిపించి తుపాకులతో కాల్చి తుదకు అడవులలోనికి పారిపోయిరి. సిపాయిలు వారికొరకెంత వెదకినను దొరకనందున సిపాయిలా చుట్టుపట్ల గ్రామములను తగులబెట్టసాగిరి. గ్రామస్థులు భయపడి ఇండ్లను ఖాళీచేసి పారిపోవసాగిరి. ఇట్లు పదునైదుదినములా మన్యములో నీ సిపాయిలు చాలా అవసలుపడి తిరిగిరి. ఇంతలో వారికి

మన్యపు జ్వరములు పట్టుకొనెను. కొందరు చచ్చిరి. తరువాత దీని నిమిత్తము ఒక రివిన్యూ సిబ్బందిని తయారుచేసి కెప్టాను ఆల్లెయిన్ బ్లాంఫీల్డు క్రింద పంపించిరి. అప్పుడు వారు సుబ్బారెడ్డిని మేడుగురు కుట్రదారులను పట్టుకొని 1857 సం॥ XIV చట్టం ప్రకారం స్పెషల్ కమీషనరు హోదాతో పనిచేయుచున్న సెషన్సు జడ్జి యెదుట పెట్టిరి. ఆయన విచారించి సుబ్బారెడ్డికిని కొర్ల సీతారామయ్యకును ఉరిశిక్షలు విధించెను. ఆ ప్రకారము వారిని 1858 అక్టోబరు 7వ తేదీని బుట్టాయగూడెములో నురితీసిరి.

సీతారామయ్య సవతి తమ్ముడు కొర్ల వెంకటసుబ్బారెడ్డిని గురుగుంట్ల కొమ్మిరెడ్డిని అదివరకనే శంకరస్వామి హత్యకు మద్దతు చేసిన నేరమునకు పోలవరములో నురితీసిరి. అప్పుడే కోరుకొండ సుబ్బారెడ్డి సోదరుడైన తిమ్మిరెడ్డి యీ తిరుగుబాటులో పాల్గొనినందులకు తూటిగుంటలో నురితీసిరి.

ఈ విచారణ జరుగుచుండగా ముఖ్యమైన ముద్దాయిలలో నొకడు చేతులు జోడించి అయ్యా నానాసాహెబుగారు ఉత్తర హిందూస్థానమున ఇంగ్లీషువారిని జయించి తన సైన్యముతో వచ్చుచున్నారనియు ఇంగ్లీషు వారికి వ్యతిరేకులైనవారికి తగినరీతిగా బహుమానము లొసగుననియు నేను విన్నందువల్లనే యీ తిరుగుబాటులో పాల్గొంటినని చెప్పెను. *

యెర్నగూడెము తాలూకా పూర్వము రాజమహేంద్రవరము లేక గోదావరి జిల్లాలో చేరియుండెను. దాని ఉత్తరమున నిజాము రాజ్యమును దక్షిణమున తణుకు. తూర్పున గోదావరినది పడమట ఏలూరుతాలూకాయు నుండెను. దీని విస్తీర్ణము 1249 చదరపు మైళ్ళు. 1868 లో దీని జన సంఖ్య 145775. ఇందులో 203 గ్రామములుండెను. ఇందులో 82 జమీందారీ గ్రామములు. యెర్నగూడెము జప్టంగి కొండమన్యములు. నాగరక ప్రజల తాలూకాలకు దగ్గరగా నున్నందువలన తక్కిన ప్రాంత

* Godavari District Manual; - Henry Morris pp 299-301

ములకన్న నీప్రాంతములు కొంత తెలుగుమీరి యుండెను ఇది 385
చదరపుమైళ్ళ వైశాల్యము కలిగియుండెను. ఇందులో కోయజాతివారుం
డిరి. ఇక్కడ భూములు కొన్ని ముస్తాజరుదారుల క్రింద కౌళ్ళకిచ్చుచుండిరి.
ఇక్కడి అబ్కారీ నల్లమందు వ్యాపారములు పక్కన ప్రాంతములకు
భిన్నముగానుండెను. ఉప్పు శాసనసమ్మతమును తేరాగానుండెను. కలెక్ట
రులే గవర్నరుగారి స్పెషల్ ఏజెంటులుగా పరిపాలించుచుండిరి.

ఈ యెర్నగూడెము కొండల ప్రదేశములో 1858లో నొకతిరుగు
బాటు ప్రారంభమయ్యెను. పలాచోట్ల కొండజాతివారును ఇతర జనులును
తిరగబడిరి. ఇది 1862వఱకును జరుగుచునేయుండెను. ఇంగ్లీషుప్రభుత్వము
వారుదీనినణచి తిరుగుబాటుదారులలో కొందరిని పట్టుకొని ఉరితీసిరి. ముఠా
దారుల ముఠాలను. ఇంగ్లీషుప్రభుత్వమువారు రద్దుచేసి వారు తీసుకొన్న
గ్రామములను ప్రక్కనున్న రెండు గ్రామముల గ్రామ మునసబుల
క్రింద నుంచిరి. అంతట నీగ్రామములలో అల్లరులు తగ్గి శాంతిపరిస్థి
తులేర్పడెను. ఈ ప్రాంతములో కొంతభాగము పోలవరము గూటాల
జమీందారీలలో చేరియుండెను *

హైద్రాబాదు నిజాము మంత్రియైన సలారుజంగు ఇంగ్లీషు కుంపినీ
వారికి మిత్రుడైనందున నిజాము ప్రభుత్వ మింగ్లీషు కుంపినీవారి పక్షము
వహించి 1857 లో ఉత్తరహిందుస్థానములో ప్రారంభమైన తిరుగుబాటు
దక్కనులో వ్యాపించకుండా తగు బందోబస్తులు చేయసాగెను. అయితే
నిజాము రాజ్యములోని వివిధ ప్రాంతములందలి ప్రజలలో తీవ్రమైన
అసంతృప్తి వ్యాపించి కొన్నిచోట్ల కల్లోలములు కలిగెను. నానాసాహెబు
గారి మనుష్యులు, తాంతియాతోపి సైన్యములోని రోహిలాలు దక్కనులో
ప్రవేశించి తిరుగుబాటులను ప్రోత్సహించిరి. వాహబీలు మహమ్మదీయుల
లో ప్రచారము చేయసాగిరి. నిజాము ఇంగ్లీషువారితో చేరినందున నీరాజ్య

Ibid. 20, 264, 299, 300, 303.
* Maclean's Manual Vol I. p 75.

మును నాశనము చేయవలెనని పీష్వాగారి పక్షమువారు ప్రచారము చేయుచుండిరి.

ఈ సందర్భములో హైదరాబాదు రాజ్యములోని ఆదివాసులు పరిసర ప్రాంతములవారితో కలిసి తిరుగుబాటులు గావించిరి. ఔరంగబాదు జిల్లాలోని భిల్లులు ఇంగ్లీషు కంపెనీవారిపైన తిరుగుబాటు గావించిరి. వైజాపూరు కాపురస్థుడైన గోవిందరావు కాశీరావుపాండేయను వతడును షాబాజీ నాయకుడును భిల్లుల నాయకులైరి. రెండువేల మంది భిల్లులు ప్రోగై ఔరంగాబాదు అహమ్మదునగరు జిల్లాలలో తిరుగుబాటు సైన్యమున చేరిరి. ఇంగ్లీషు సైనికాధికారియైన కెప్టాను పెల్లరు వాయిజాపూరు తాలూకాలోని వారాదగర నీ భిల్లులసేన నెదుర్కొనెను. అప్పుడు జరిగిన యుద్ధమునందు ఇంగ్లీషుసైనికుల తుపాకిగుండ్ల వర్షమునందు నలుబది మంది భిల్లు మరణించిరి. వారి విల్లునమ్ములు ఖడ్గములు ఇంగ్లీషుసైన్యమును ప్రతిఘటింపలేకపోయెను. అందువలన వారి సైన్యము చెల్లాచెదరయ్యెను. వారినాయకుడైన గోవిందరావుగారు శత్రువులకు పట్టుపడగా నాయన నింగ్లీషువారు ఖైదుచేసిరి.

ఉత్తరమున నింగ్లీషు కంపెనీవారితో యుద్ధము చేయుచున్న సేనానాయకుడైన తాంతియాతోపిసేనలోని రోహిలాలు దక్కనులో ప్రవేశించి అజంతా గ్రామమును పట్టుకొనిరి. 1858 ప్రారంభములో వీరి గుంపులను ఔరంగబాదునుండి పారదోలిరి. అంతట వారిలో కొంతమంది పర్భనిజిల్లాలో ప్రవేశించిరి. 1858 జనవరి 10వ తేదీన హింగోలి దగ్గర 17 గంటలు ఘోరమైన యుద్ధము జరిగెను. అందులో కొందరింగ్లీషు కెప్టానులు గుండుదెబ్బలు తినిరి. రోహిలాలు తుదకు అపజయము పొందిరి గాని వారి అల్లరులు సాగుచునేయుండెను. వారు ధారాశివ జిల్లాలోని గ్రామములను దోచుకొనుచు ఇంగ్లీషు సైనికులతో సంకుల సమరములను చేయుచుండిరి.

హైదరాబాదు సంస్థానమునందు ఆదిలాబాదు జిల్లాలో నుండిన ఆదిమవాసులగు గోండుజాతివాడు "రాంజీగోండు" అను నాయన నాయ

కత్వము క్రింద రోహిలాలతో కలిసి బ్రిటీషుదొరతనముపైన తిరుగుబాటుగావించిరి. ఆదిలాబాదు జిల్లాలోని ఉట్నూరు తాలూకాలో నొక యుద్ధము జరిగెను. అక్కడి తిరుగుబాటుదారులలో 200 మంది రోహిలాలు 300 మంది గోండలు నుండిరి. ఇంగ్లీషు కుంపిణీ సైన్యములు 1859 లో వారి నోడించి చెదరగొట్టెను. ఆంగ్లేయ సైనికోద్యోగులు రాంజీగోండును పట్టుకొని ఆదిలాబాదులో నిర్మలపట్టణమున నొక చెట్టు కొమ్మకు కట్టి యురితీసిరి. ఆచెట్టు నిప్పటికిని 'రాంజీగోండు' చెట్టు అని పిలుచుచుందురు.

---

చూడు : ఆంధ్రప్రదేశ చరిత్ర, దిగవల్లి వేంకటశివరావు.

# 10. భిల్లుల కథ

ఆటవిక జనమును దయగా జూచి వారితో స్నేహము చేసినచో వారెంత విశ్వాసపాత్రులుగా నుందురో ఇంగ్లీషుప్రభుత్వ కాలమున జరిగిన ఒక సంఘటనము వలన తెలియగలదు. ఇంగ్లీషు కంపెనీవారు 1818 లో మహారాష్ట్ర సామ్రాజ్యమును విచ్ఛిన్నముచేసిన పిమ్మట ఆదేశములోని వివిధప్రాంతములందు తమ రాజ్యాధికారము స్థాపించుటకు ప్రయత్నించిరి. 1853 లో నాగపూరురాజును పదచ్యుతుని చేయుటతో మధ్యరాష్ట్రములోని మహారాష్ట్ర రాజ్యము పూర్తిగా ఇంగ్లీషువారి వశమయ్యెను.

ఇంగ్లీషువారు ఖాందేషులోను బొంబాయి రాష్ట్రములోను గల భిల్లులనుఆటవిక జనము నివసించు రాజ్యమును స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నించిరి. భిల్లులు చాలా ధైర్యముకలవారు; శూరులు; విలువిద్య యందు ప్రవీణులు. వీరింగ్లీషువారిపైన 1825లో తిరుగుబాటు గావించిరి. ఇంగ్లీషు కంపెనీవారు భిల్లులపైకి 23 వ రెజిమెంటు అనబడు సైనిక దళమునుపంపి వారినణచుటకు ప్రయత్నించిరి. తీవ్రమైన యుద్ధము జరిగెను. హైదరాబాదులోని నిజాము ఖర్చుపైన నుంచబడిన ఇంగ్లీషు సైనిక దళమును కూడా వారికి సహాయముగా నంపిరి. ఖాందేషులో నొక భిల్లు ఏజెన్సీ పద్ధతిస్థాపించిరి. తరువాత 1857 స్వాతంత్ర్య యుద్ధమునందు ప్రఖ్యాతివహించిన సేనాధిపతియైన సర్ జేమ్సు ఔట్రాము 1825 నాటికి 25 సంవత్సరముల వయస్సుగల యువకుడు. అతనిని ఖాందేషుకు పంపిరి. అతని ధైర్య సాహసములు ఔదార్యమును చూచి భిల్లుల కాయనపైన గౌరవము కలిగెను. ఆయన వారిపట్ల దయగా నుండుట వలనను అతడు గొప్ప వేటకాడైనందువలనను వారి కాతనియందు భక్తి

విశ్వాసము లేర్పడెను. అంతట వారాయనకు లోబడిరి. ఆతడు "లైట్ ఇన్‌ఫాంట్రీకోర్" అనబడు పదాతిదళము నేర్పరచి అందు భిల్లులను చేర్చుకొనెను. తరువాత నాయన నితరప్రాంతములకు బదిలీ చేసినను భిల్లు లాయన యందలి భక్తి విశ్వాసమును వీడక ఆయనను కొలుచుచు ఆయన ప్రభావము వలన ఇంగ్లీషు కుంపినీ బహదూర్ వారి నమ్మినబంటు లైరి. అందువలన భారతదేశములోని ఇతరప్రాంతముల యందలి ఆటవికజాతులింగ్లీషువారితో విరోధించితిరుగుబాటు చేయుచున్నను భిల్లులు మాత్రము ఆంగ్లప్రభు భక్తులై యుండిరి 1840-44 మధ్య "మేవార్ భిల్లుకోర్పు" అనబడు సైనికదళము నేర్పరిచిరి. 1857 లో జరిగిన భారత స్వాతంత్ర్య యుద్ధమునందు ఇంగ్లీషువారికి తోడ్పడిరి.

భిల్లులు పూర్వము రాజపుత్ర స్థానమున నుండిరి. వారి నితరరాజులు వెనుకకు త్రోసిరి. భిల్లులిప్పుడు ఆబూపర్వతము అశీర్‌ఘడ్ కొండల మధ్యగల దేశమునందు నివసించుచున్నారు. ఇది అడవులతోను కొండలతోను నిండియున్న ప్రాంతము. అక్కడనుండివారు గుజరాతులోనికిని సింధురాష్ట్రములోనికిని దక్షిణ భారతదేశములోనికిని వ్యాపించిరి. వారు గొప్ప వేటకాండ్రును వృక్షములను నరుకుటలో నేర్పరులేగాని వ్యవసాయము చేయుటలో చాల వెనుకబడి యున్నారు. వీరిలో నలుబది కులములవారున్నారు. వీరు తమగ్రామములలోని భిల్లనాయకులను కొల్చుచు వారి యాజ్ఞ ప్రకారము యుద్ధము చేయుచుందురు. ఘోరమైన క్షామము వచ్చినప్పుడుతప్ప వీరు గోమాంసమును తినరు. ఇతర ఆటవిక జాతులవారివలెనే వీరును పాములను ఎలుకలను కోతులను గుఱ్ఱములను తినరు. వారు పెద్దపులి నొక దేవతగా కొలుతురు. చంద్రునిపైని చక్కనైన ప్రమాణము చేయుదురు. వాయు శక్తిని హనుమంతుని భజింతురు. హిందువుల పండుగలను వీరు చాలా ఉత్సాహముతో జరుపుదురు. హిందువులలో నున్న మూఢ విశ్వాసము లనేకములువీరికిని కలవు.

---

Encyclopaedia Britannica XIV th. Edition. Articles on Sir James Outram; and Bhils.